Regd. No. H.N.L. 18

23-4-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక :17 విడిప్రతి : రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట రామానాయుడు

# కోవూరు అభ్యర్థిత్వం ముగ్గురి మధ్య వుందా?

కోవూరు ఉపఎన్నికకు మూడు ప్రతిపక్షాలకు చెందిన అభ్యర్థుల పేర్లు అధికార యుతంగా ప్రకటితమైనాయి. సి.పి.ఎం. – జక్కా వెంకయ్య, తెలుగుదేశం – నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి, బి.జె.పి. – సి.హెచ్. వరదయ్య అవన్నీ ఊహించినవే, తెలిసినవే!



పి.వి. ప్రసన్న రెడ్డి

కాని కాంగ్రెస్ అభ్యర్థి ఎవరనేది శుక్రవారం మధ్యాహ్నం వరకు నిర్ణయం జరగ లేదు. సాయంకాలానికి జరిగితే జరగ వచ్చుంటున్నారు. అసలు ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డి, మాజీ ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డి గారలు ఇప్పటికి ఈ విషయంలో కలసుకొని మాట్లాడ లేదు. బహుశా ఈ రోజా కలుసు కోవచ్చునేమో! అదే కాదు, కోవూరు ఎన్నిక బాధ్యత తమ భుజస్కంధాల మీద వేసుకుంటారను కునే మాగుంట సోదరులు కూడా ఇద్దరు ముఖ్యులను కలిపి మాట్లాడించ డానికి ప్రయత్నించినట్లు లేదు; హైదరాబాదులోనే వుండి పరిస్థితులను పోకడలను పరిశీలిస్తున్నట్లుంది. ఎందువల్లనో విజయభాస్కర రెడ్డి గారు చొరవ తీసుకున్నట్లు లేదు. జిల్లా వాడైన జనార్ధన రెడ్డితో మర్యాద కోసమైనా ప్రాథమిక సంప్రదింపులు జరిపినట్లు లేదు.

కాంగ్రెస్ అభ్యర్థిత్వానికి చేవూరు దేవకుమార్ రెడ్డి హైదరాబాదులో పుగ్గ బట్టి కూర్చుని వున్నాడట. దేవకుమార్ రెడ్డి నియోజక వర్గంలో ప్రచారం మానుకొని అకస్మాత్తుగా హైదరాబాదుకు పోయినప్పుడే ఏదో కథ అని అందరూ అనుకున్నారు. విరమించుకో వలసిందిగా అతన్ని వొప్పించుటకు ప్రయత్నం జరుగుతున్నట్లుంది. జనార్ధన రెడ్డి మాత్రం అతని అభ్యర్థిత్వ విషయంలో ఎన్నడూ, ఎవరి విషయంలోనూ లేనంత పట్టుదలగా వున్నాడు. వుప్పెన వంటి వ్యతిరేకత ముంచుక వచ్చినపుడు పునరాలోచనలో పడక ఆయన మాత్రం ఏమి చేయగలుగుతాడు? జనార్ధన రెడ్డి

తరువ 7 పేజీలో

## దేవకుమార్ పేరు వెనుకకు పోయినట్లే!

### వెలుగులో వున్న అభ్యర్థులు

పెళ్లకూరు వసంత కుమార్ రెడ్డి,
పి.వి. ప్రసన్నరెడ్డి, సామంతు సుబ్బారెడ్డి



పి. వసంత కుమార్ రెడ్డి

# విజయభాస్కర రెడ్డి వేగం పాణ్యం తర్వాత మరీ పెరిగి పోయింది !

పాణ్యం విజయంతో ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డి చంద్ర భాస్కరుడిలా కొత్త అవతారమెత్తారు. పాణ్యం ఉపఎన్నికకు పూర్వం అర్నెల్లు ముఖ్యమంత్రిగా శాంత రూపంలో కనపించిన కోట్ల ఇపుడు పూర్తిగా మారిపోయాడు. రాజకీయ నిర్ణయాలు తీసుకోవటంలో ఇప్పుడాయన జెట్ స్పీడును అనుసరిస్తున్నారు. ప్రత్యర్థుల పై నోరు జారని కోట్ల వారు ఇప్పుడు చంద్ర నిప్పులు కురిపిస్తున్నారు. తనను విమర్శించే వారన్నా, తనకు వ్యతిరేకంగా వ్యవహరించే వారన్నా ఆయనకు గిట్టడం లేదు. పాణ్యం ఎన్నికల్లో విజయం సాధించినందుకు ప్రజలకు కృతజ్ఞతలు తెలిపేందుకు వెళ్లిన కోట్ల వారు ప్రత్యర్థుల గుండెల్లో బాంబులు పేల్చినంత పనిచేశాడు. ఏ ఊర్లో అయితే



తనకు కాస్తంత వ్యతిరేకత అనిపించిందో అక్కడ సభ పెట్టి మరీ ప్రత్యర్థులకు సవాలు విసిరారు. "తెలుగుదేశంఅభ్యర్థిని

తరువ 7 పేజీలో

# ప్రొహిబిషన్ ప్రవేశానికి స్వాగతం: రద్దుకు సంతోషం!

## 1947, 1969 లలో 'జమీన్‌రైతు' సంపాదకీయాలు

### మద్యపాన నిషేధం

### (3 - 10 - 1947)

అక్టోబరు మొదటి తేది నుండి నెల్లూరుతో సహా ఎనిమిది జిల్లాలలో మద్యపానానికి మద్రాసు ప్రభుత్వం స్వస్తి వాచకం చెప్పడం సంతోషం. అహింస, ఖద్దరుదారణ, మద్యపాన నిషేధము మహాత్మ గాంధి భారత ప్రజానీకాని కందిచ్చిన అమృత సందేశాలు. అఖిల భారత కాంగ్రెస్ ఆదేశానుసారం మొట్టమొదట భారతదేశంలో మద్య పాన నిషేధాన్ని ఆనాడు అమలు జరిపించింది మద్రాసు ప్రభుత్వం. నేడు యిప్పటికి పదహారు జిల్లాలలో విజయవంతముగ అమలు జరిపించుచున్నది గూడ మద్రాసు ప్రభుత్వమే. దీనికి మన రాష్ట్ర ప్రజలు ముఖ్యంగా కష్టజీవులు కృతజ్ఞతలు. మద్యపానం వల్ల కలుగుచున్న అనర్థకాన్ని బాగా తెలుసుకొన్న వారెవ్వరు అది మంచిదనరు. మన దేశం బీదది; ప్రజలు బీదవాళ్లు; సంపాదన స్వల్పము. అలాంటప్పుడు మద్యపానంతో బీదలు మరింత బీదవాళ్లు కావడానికి వీలుందినది. దీనికి తోడు ఆరోగ్యానికది అతిభంగకారి.

మద్యపానానికి నేడు రాష్ట్ర ప్రభుత్వం స్వస్తి చెప్పడంతో కష్ట జీవులు తమ ఆర్జనలో కొంత మిగుల్చు కుంటారు; ఆరోగ్యాన్ని బాగు చేసుకుంటారు; ఇళ్లల్లో గింజలు నిల్వ చేసుకుంటారు; పిల్లలకు కడుపు నిండా కూడు పెట్టుతారు; సతీమణులకు దెబ్బలు తగలడం తప్పిపోతుంది! కుటుంబాలు నిత్య కళ్యాణంతో కళకళ లాడ గలవు.

చెన్న రాష్ట్ర ఆర్థిక పరిస్థితి అనుగ్రహించక పోవడం చేత ప్రభుత్వం క్రమక్రమంగానే మద్యపానాన్ని రాష్ట్రంలో నిషేధిస్తున్నది. కాని వచ్చే సంవత్సరం మిగత జిల్లాలలో అంతా ఒకే తూరి త్వరగా నిషేధం జరగాలని ప్రజలు గాఢంగా వాంఛిస్తున్నారు.

* * *

### ప్రొహిబిషన్ రద్దు

### (5 - 9 - 1969)

మద్యనిషేధాన్ని రద్దు చేయుటకు ఆంధ్ర శాసనసభ కాంగ్రెస్ పార్టీ నిర్ణయించినట్లు వార్త వచ్చింది. బాధాకరమైనా కాంగ్రెస్ పార్టీ ఈ నిర్ణయం సంతోషదాయక మైనదే; అభినందనీయమైనదే.

మద్య నిషేధం వల్ల త్రాగుడు ఏ మాత్రం తగ్గలేదు సరిగదా; పూర్వం త్రాగుడుకు అలవాటు పడని స్త్రీలు పిల్లలలో కూడా విపరీతంగా వ్యాపించి పోయింది. మద్యనిషేధం అమలులో లేనప్పుడు మత్తు పదార్థాలలో మంచివైనా దొరికేవి; మద్య నిషేధం అమలుకు వచ్చిన తర్వాత గాపుడు సారాయి ఎక్కువై పోయి, త్రాగే వారి ప్రాణాలకే ముప్పుగా పరిణమించింది. రెండవది — త్రాగుడు వల్ల నేరాలు పెరిగాయి; చట్టధిక్కార ప్రవృత్తి విచ్చలవిడైపోయి, అన్ని రంగాలకు వ్యాపించింది. మూడవది — పోలీస్‌లో అవినీతి ప్రబలి, ఆ శాఖను నీతిభ్రష్టం చేసింది. ఆఖరుగా — ఈ అన్ని అనర్థాలకు బహుకృతా అన్నట్లు ప్రభుత్వానికి కోట్లాది ఆదాయం పోయింది. ప్రజలను సంస్కరించలేక పోగా, అవినీతికి అక్రమాలకు కారకమైన ఈ మద్య నిషేధాన్ని రద్దు చేయమనక, కొనసాగించ మనడం ఏమి వివేకం?

ప్రొహిబిషన్ అంటె ప్రజల్లో ఎగతాళి అయిపోయింది. విఫలమైన ఏ చట్టాన్ని పోల్చాలన్నా ప్రొహిబిషన్ చట్టంతో పోల్చడం జరుగుతున్నది. ప్రొహిబిషన్ అమల్లో వుండి త్రాగుడు విచ్చలవిడిగా కొనసాగడం కంటె, త్రాగుడు చట్ట విరుద్ధమై అది నిర్భయంగా వుల్లంఘించ బడడం కంటె, దాన్ని రద్దు పరచడమే ప్రభుత్వానికి మర్యాద, చట్టానికి గౌరవము, రాష్ట్రానికి ఆదాయము. ప్రొహిబిషన్‌ను రద్దు పరచవద్దనే వారు ఇంకా ఎవరైనా వున్నారంటె వారిని ప్రజల మధ్య తిరగని వారుగా, ఆకాశంలో విహరించే వారుగా, వాస్తవాన్ని గుర్తించని వారుగా పరిగణించ వలసిందే కాని, వారి మాటలకు విలువివ్వలేము. మద్య నిషేధం వల్ల ఇప్పటికే జరగ కూడనంత చెడ్డ జరిగి పోయింది ఇంకా జరగడాన్ని సహించలేము.

కాంగ్రెస్ వాదులు కాని, లేక మద్య నిషేధ వాదులు ఎవరైనా కాని ప్రొహిబిషన్ రద్దుకు చింతించడం కాదు కావలసింది. త్రాగుడుకు విరుద్ధంగా ప్రబోధం చేయాలె; ప్రజల మధ్యకు, సామాన్య ప్రజల మధ్యకు పోయి త్రాగుడు అనర్థాలను గూర్చి ప్రచారం చేయాలె. త్రాగిన వాణ్ణి చూచి సంఘం పరిహసించాలె. త్రాగి ప్రజల ముందుకు రావడానికి సిగ్గు పడేట్లు చేయాలె. త్రాగుబోతును వెలి వేయగలిగి వుండాలె. త్రాగుడుకు వ్యతిరేకంగా ఒక మహోద్యమమే సాగాలె. నైతికమైన సంఘకట్టు బాటుతో త్రాగుడు తగ్గవలసిందే కాని, చట్టం సాధించ గలిగేది కాదు. ఈ సత్యాన్ని ఇరవై ఏళ్ల విఫలత చాటుతున్నది.

## పొరపాటు చేశారు!

ఎన్నికలలో ఏ రాజకీయ పార్టీ కూడా ముందుగా తమ అభ్యర్థులను ప్రకటించుకోదు. కాంగ్రెసేతర పార్టీలైతే తమ అభ్యర్థుల నిర్ణయం జరిగినా, కాంగ్రెస్ అభ్యర్థి ఎవరో వెల్లడయ్యే వరకు తమ అభ్యర్థుల పేర్లు బయట పెట్టవు. కాంగ్రెస్ అభ్యర్థిని బట్టి తమ అభ్యర్థుల మార్పు అవసరమవుతుందేమో ననే దృష్టిలోనే ప్రతిపక్ష పార్టీలు ఆ విధంగా చేస్తుంటాయి. కాంగ్రెస్‌కు గోప్యాలు, రహస్యాలు ఏమీ వుండవు గాని పార్టీ అభ్యర్థి విషయంలో ఇదమిద్ధంగా ఒక నిర్ణయానికి రాలేక, మల్లగుల్లాలు పడుతూ, చివరి క్షణంలో నిర్ణయించడం జరుగుతుంటుంది. ఆఖరు తేదీ నాటికి కూడా తేలక పోతే ఇద్దరు ముగ్గురి చేత నామినేషన్లు వేయించి, ఉప సంహరణ రోజు సెలక్టు చేసిన అభ్యర్థిని వుంచి, మిగిలిన వారిని వుపసంహరి చుకో మని ఆదేశించడం ఆనవాయితీ. ఒక్కొసారి నామినేషన్ వేసిన అభ్యర్థి గాని, అభ్యర్థులు గాని పార్టీ ఆదేశాన్ని ధిక్కరించి వుపసంహరించు కోకుండా తిరుగుబాటు చేయడం కూడా సర్వ సాధారణమే.

కోవూరు నియోజక వర్గంలో ఆ సాంప్రదాయానికి విరుద్ధంగా కాంగ్రెస్ అభ్యర్థి ఫలాని వాడని టాంటాం జరగడం, ఆ అభ్యర్థి ప్రచార పర్యటనకు పూనుకోవడం వల్ల అన్ని రకాల వ్యతిరేకతలూ సంఘటితమై, నిర్ణయ సమస్య క్లిష్ట రూపం దాల్చింది. ఇది వ్రాస్తున్న సమయానికి - 22 తేదికి — అభ్యర్థి ఎవరనేది అగమ్య గోచరమై సందిగ్ధంలో పడిపోయి వుంది. ఒక్క బి.జె.పి. మాత్రం అధికార యుతంగా తన అభ్యర్థిని ప్రకటించింది. తెలుగుదేశం అభ్యర్థి నిర్ణయం జరిగి పోయింది గాని, అధికారికంగా ప్రకటన జరుగలేదు. బహుశా కాంగ్రెస్ అభ్యర్థి ఎవరనే దాని కోసం వేచి వున్నారో ఏమో తెలియదు: కాంగ్రెస్ అభ్యర్థిగా ప్రస్తుతం వున్న వ్యక్తి వుండాలని తెలుగుదేశం నాయకులు ముక్కోటి దేవతలకు మ్రొక్కు కుంటున్నట్లు నమ్మదగిన వార్త. వారు అన్ని తతంగాలు పూర్తి అయినా తమ అభ్యర్థి పేరు ప్రకటించలేదంటె ఇందువల్లనే ననుకోవాలి. సి.పి.ఎం. తమ పోటీ ఖాయ మంటున్నది; ఏ పరిస్థితుల్లోనూ మానుకునేది లేదని బల్లగుద్ది చెప్తున్నది. కాని అభ్యర్థి పేరు, ప్రకటన జరగలేదు. అది జరిగితే గాని వీరి పోటీ వుంటుందని దృఢంగా విశ్వసించలేము.

నాయకుణ్ణి బట్టి, ఆ నాయకుడుతో కాంగ్రెస్ అభ్యర్థిగా వెలుగులోకి వచ్చిన అభ్యర్థికి వున్న ప్రగాఢ అనుబంధాన్ని బట్టి ప్రజలు అభ్యర్థి ఫలాని వాడుగా వుంటాడని వూహించు కోవచ్చు. కాని ఆ వ్యక్తే తానే అభ్యర్థినని ప్రకటించు కోవడం, దానికి నాయకుడు అనుమతించడం వల్ల లేని పోని చిక్కులేర్పడ్డాయి. అవు రావురంటూ ఆత్రంతో వున్న వ్యక్తి తానే అభ్యర్థినని ప్రచారం చేసుకోవడం అసహజమేమీ కాదు; కాని రాజకీయ చతురతలో, మెళుకువల్లో తనకు తానే సాటి అనిపించుకున్న నాయకుడు కూడా తప్పటడుగు వేయడం విస్మయం గొలుపుతున్నది. ఈ పొరపాటే

పినాకి చిత్రం

జరగకుంటె ఈనాడు ఆ అభ్యర్థిత్వం ఇంతగా వివాదాస్పద మయ్యేది కాదు; ఇంతటి ప్రతిఘటనకు అవకాశం వుండేది కాదు; వివిధ వర్గాలలో ఇంతగా చర్చలు మంతనాలు జరగడానికి ఆస్కారం వుండేది కాదు, వ్యవధి చిక్కేది కాదు. కాస్త

కొరవ 11 వ పేజీలో

జమీన్‌రైతు

# కోట్ల ఆగ్రహం

తనకు వ్యతిరేకంగా, తెలుగు దేశంకు అనుకూలంగా ఓటు వేసిన పాల్యం ప్రజలను తప్పు పడుతూ ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి ఆగ్రహం వ్యక్తం చేయడం ఆయన ప్రతిష్ఠకు తగినట్లు లేదు. విజయ భాస్కర రెడ్డి సీనియర్ రాజకీయ వాది. నలభై, యాభై పంచాయితీ నుంచి పార్లమెంటు వరకు ఎన్నికలలో పాల్గొంటూ, గెలుపు ఓటములను సమంగా చవి చూసిన అనుభవ శాలి. అటువంటి వ్యక్తి, ప్రజలు తనకు వ్యతిరేకంగా ఓటు వేయడాన్ని సహించ లేక పోతున్నాడంటే ఏమనుకోవాలి? ప్రతిపక్షానికి ఓటు వేసిన వారిని మహా పాపులుగా పరిగణించే సంకుచిత తత్వం నాయకులలో ఏర్పడడం దురదృష్టకరం.

ప్రజాస్వామ్య రిపబ్లిక్‌గా భారత్ అవతరించి నాలుగు దశాబ్దాలు పై బడినా మన నేతలకు ప్రజాస్వామ్య పద్ధతుల పట్ల అవగాహన ఏర్పడక పోవడం విస్మయం కల్గిస్తున్నది. ఎన్నికలు అనేవి జరిగినపుడు తమ కిష్టమైన వారికి ఓటు వేసే స్వేచ్ఛ ప్రజలకు లభిస్తుంది. నేను మీకు పనులు చేసి పెడుతున్నాను కాబట్టి, మీ ఓట్లన్నీ నాకే వేయాలని నిర్బంధించే అధికారం ఏ నాయకుడికీ వుండదు. రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటన్‌కు విజయం చేకూర్చిన చర్చిల్‌నే మరుసటి ఎన్నికల్లో ఓడించారానాడు. అట్లా నిర్బంధిస్తే అది నియంతృత్వమౌతుందే తప్ప ప్రజాస్వామ్యం కానేరదు. ప్రజలకు సేవ చేయడం ద్వారా వారి అభిమానం సంపాదించి గెలుపొందడానికి ప్రయత్నించాలే తప్ప దబాయించి, బెదరించి ఓటర్లను ఆకట్టుకోవడం అనర్థాలకు దారితీస్తుంది. రిగ్గింగులతో, దౌర్జన్యాలతో ఎన్నికలను తమకనుకూలంగా మల్చు కోవడం అనవాయితీ అయిన రాయలసీమ నాయకులకు ప్రజాస్వామ్య యుతంగా, స్వేచ్ఛగా ఎన్నికలు జరగడం కంపరం కల్గించడం సహజం. ఆ అసహనాన్ని దాచుకోలేక ఈ రూపంలో ఆగ్రహం వెలి గ్రక్కుతున్నాడు ముఖ్యమంత్రి.

ఏది ఏమైనా విజయ భాస్కర రెడ్డి గారిది తొందరపాటు. ఇప్పటికైనా ఆయన తన తప్పు తెలుసుకొని, ఆవేశం అణచుకొని, సంయమనంతో వ్యవహరించ గలిగితే ప్రతిష్ఠ నిలుస్తుంది.

# రాజీవ్‌కు అపచారం

తమిళనాడులో కాంగ్రెస్ పార్టీ పిఎంకె పార్టీతో చేతులు కల్పి, పొత్తు కుదుర్చుకో బోతున్న దన్న వార్త ప్రతి కాంగ్రెస్ వాదినీ దిగ్భ్రాంత పరుస్తున్నది. జయలలిత మీద కక్షతో వారీ నిర్ణయం తీసుకున్నట్లున్నారు. అహంకారంతో, అధికార మదోన్మత్తతతో జయలలిత వ్యవహరించడం, ఆ కారణంగా కాంగ్రెస్‌తో పేచీ పెట్టుకొని తెగ తెంపులు చేసుకోవడం తప్పు పట్ట వలసిన విషయాలే; రాజకీయంగా ఆమెను, ఆమె పార్టీని ఎదుర్కొని, అధికారం నుంచి దించడానికి ప్రయత్నించ వలసిందే. అయితే అందుకోసం రాజీవ్ గాంధీ హంతకులుగా ముద్రపడిన వారితో చేతులు కల్పడం ఘోరం కాదా?

పిఎంకె పార్టీ అంటే తమిళనాడులో ఎల్‌టిటిఇ స్వంత సంస్థ. తెర వెనుక జరిపే తీవ్రవాద కార్యకలాపాలకు రాజకీయంగా మద్దతు సమకూర్చే ఉద్దేశ్యంతో ఎల్‌టిటిఇ నడుపుతున్న తీవ్రవాద పార్టీ. బహిరంగంగా ఎల్‌టిటిఇ కార్యకలాపాలను సమర్థిస్తూ, సభలు పెట్టి ప్రజల్లో ప్రచారం చేస్తూ, ఎల్‌టిటిఇ హంతకులను పోలీసుల నుంచి రక్షిస్తూ, కోర్టులలో వారి తరఫున వాదిస్తూ వుండే పార్టీ అది. రాజీవ్ గాంధీ హత్యకు పథకం పన్నింది, హతమార్చింది ఎల్‌టిటిఇ అని తెలిసీ కాంగ్రెస్ నాయకులు ఆ పార్టీతో చేతులు కలప జూస్తున్నారంటే అది పార్టీ ద్రోహమే కాదు, ఆత్మ ద్రోహం కూడా అవుతుంది. జయలలిత పై కక్ష సాధింపు గానే కేంద్ర హోం మంత్రి శ్రీ ఎస్ బి చవాన్, పిఎం కె పార్టీని నిషేధించాలని తమిళనాడు రాష్ట్ర ప్రభుత్వం చేసిన అభ్యర్థనను తిరస్కరించారు. ఈ పరిణామాలన్నీ ప్రధాని శ్రీ పివి నరసింహ రావుకు తెలియకుండా జరుగుతున్నాయని భావించలేము. తాత్కాలిక రాజకీయ ప్రయోజనాల కోసం, వ్యక్తిగత కక్ష సాధింపుల కోసం, దేశాన్ని పాలించే పార్టీ, ప్రభుత్వం ఇటువంటి వినాశకర శక్తులతో స్నేహం చేయ బూనడం క్షమించరాని నేరమౌతుంది. మరణించిన మహా నాయకుడికి అపచారం చేయడమౌతుంది. అధికారంలో వుండే వారే అతివాద శక్తులతో చెలిమి చేయడం ప్రారంభిస్తే అరాజకాన్ని అదుపు చేసెదెవరు? ప్రధాని తక్షణం ఈ పొరపాటును సవరించుకుంటే కాంగ్రెస్ అభిమానులు సంతోషిస్తారు; రాజీవ్ ఆత్మ శాంతిస్తుంది.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

జమీన్‌రైతు
23-4-43
4 పేజీలు 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

### దేశముక్తి

గీ. అభినయగమ్మురు జపానుహంతకుండు
మనదు పెట్రోలు నంత శుభ్రముగ ద్రావి
బస్సుల ప్రయాణముల భంగపరచినపుడు
బొగ్గుల వేవంగి యాలోటు పూర్తి జేసి
పుణ్యముంగట్టుకొన్న రాపూరు పురము

అట్టి పురంబున 18 తేది నేషనల్ వార్ ఫ్రంటు వారి నోముల పంట యనవొప్పారు. "దేశ ముక్తి" నాటకమును రాజేంద్ర రావు గూడూరు గారి సమాదరమున కంబ రామాయణ భాషతో శృతి గలిపిన తహశీల్ దారు వారి "ఎవ్వరి చెజవించు"తో ప్రారంభించబడి నపువంటి దాయను.

అద్యంతాలు చిత్రగించాను మహాశయా! కవి త్వమేమో 'గోస్త నీ ఫల గోఘృతమే! నో డౌట్. నటకులేమో అరితేరిన కలాకౌశల ప్రాగల్భ్యులే! సందేహం లేదు. అయితే నాటకమేమో రక్తి గట్ట లేదు. కారణం బీమయా కమల నాభా అంటే ఆ లోటు కథాసృష్టి కర్తలదే (ఆ వివరాలకు దిగితే చోటు చాలదు స్వామీ)

### అరెస్టులు శిక్షలు

14 తేది అరెస్టు వేయబడిన 'జమీన్‌రైతు' సహాయ సంపాదకుడు కె.యల్.ఎన్. సింహా గారిని 19 తేది సాయంత్రం విడుదల చేశారు.

* * *

14 తేదిన అరెస్టు వేయబడిన నెల్లూరు జిల్లా రైతు సంఘం ఏజెంటు రావిపాటి మహానంద చౌదరి గారిని విడుదల చేసి, పోలీసు నిఘా లోపాదిలిలోనే వుంచారు.

– విమర్శకుడు

### రంధ్రాన్వేషి

### శర్మ జాషువ సత్కారాలు

శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారి తిక్కన జయంతి సందర్భంలో రెండవ వాయిదాగా దుర్గా సుబ్రహ్మణ్య శర్మ గారిని, 'కాందిసీకుడు' కృతి సమర్పణ సందర్భంలో జాషువా కవిని సత్కరించిన విషయం మన నెల్లూరులో వివాదాలకు ఆస్పదం కావడం మన మండల వుద్రేకాన్నే పాటుతున్నది.

దీనికి పూర్వపరాలు: జాషువా మన మండలానికి యుద్ధ ప్రచారక కురకాతో వచ్చింది మొదలు ఆయన వర్ణాలు గాకుండా వెనక దాని ఆయన మధుర కవిత్వమే విమర్శనకు గురౌతూ వస్తున్నది మనవూర.

శర్మ–శాస్త్రి వివాదాలు ఒక నాడు రేగడం, చల్లారడం – మరలా రేగడమే నెల్లూరు వాతావరణపు నిసర్గగుణము. అవే మనకు బ్యాక్ గ్రౌండ్.

శర్మ గారికి 116 లు, జాషువాకు 1116 లా? అని కేసరి పత్రిక ఆశ్చర్యం! విచారిస్తాం.

రామిరెడ్డి గారు తిక్కన జయంతికి ఏటేట ఒక్కకవిని సత్కరిస్తు వచ్చినారు. ఈనాడు ప్రత్యేకంగా మరియిద్దరని సత్కరించడం అనవసరం అని నా అభిప్రాయం. అదిగాక సుబ్బరామయ్య– శర్మ గారలు పండితులైతే అవుదురు గాని యిన్నదగిన కవులు కాదు కాబట్టి తిక్కన వర్ధంతి సన్మాన విధానాను గుణ్యంగా రెడ్డి గారి యీ యీవి వితరణ లేనిది అనాల.

శర్మ గారు ఆ దినం రాని కారణం శాస్త్రి శిష్యునితో ఒకే గాట గట్టినందున అని నేను నమ్మను. దీపుడిచ్చిన కాస్తో కూస్తో తనదిరాకు వున్నది. కాబట్టి 116 లు ఆయనకు లెక్కలోనివి కాదు కాబట్టి నిరాదరణ ఏమో!

కొరవ 1 పేజీలో

# సారా చుక్క కన్పడకుండా చేస్తేనే ఉద్యమ విజయం!

మొక్క వోని ఆత్మవిశ్వాసంతో వీరోచిత సారా వ్యతిరేక వుద్యమాన్ని నిర్విరామంగా నడిపిన నెల్లూరు నారీమణులు ఘన విజయం సాధించారు. ఎట్టకేలకు ప్రభుత్వం నెల్లూరు జిల్లాలో సారాను నిషేధించింది. ఈ వుద్యమం తీరు తెన్నులు ఒక సాంఘిక విప్లవానికి నాంది పలికాయి. అయితే నిషేధంతోనే మగువలు మనసులు మార్చుకో కూడదు. స్వంతంగా తయారయ్యే కాపుడు సారా, పక్కప్రాంతాల నుండి వచ్చే దొంగ సారాకు వ్యతిరేకంగా కూడా పోరాడాలి. నిస్తేజమై పోయి వున్న ఎక్సైజ్ శాఖ అప్పుడైనా నీతి మార్గాన నడచి ఒక మంచి పనికి ఊతమవ్వాలి. ఎక్కడా సారా చుక్క కన్పించకుండా చేసినపుడే నెల్లూరు నారీలోకం సంపూర్ణ విజయం సాధించినట్లవుతుంది.

నెల్లూరు – పి.సి. రెడ్డి

## సి.ఎం.కు అభినందనలు

మహిళల మనసు నెరిగి సారాను జిల్లాలో నిషేధిస్తున్నట్లు ముఖ్యమంత్రి శ్రీ విజయ భాస్కర రెడ్డి ప్రకటన చేయడం హర్షణీయం. కోట్ల రూపాయల ప్రభుత్వ ఆదాయం తగ్గిపోయినా మహిళలకు తానిచ్చిన వాగ్దానాన్ని ఖచ్చితంగా నిలబెట్టుకొన్నారు. చరిత్రలో సువర్ణాక్షర లిఖిత మైన పనికి నెల్లూరు మహిళలు శ్రీకారం చుట్టినందుకు ఒక మహిళగా గర్వపడుతున్నాను.

నెల్లూరు – పి. అరుణమ్మ

## బ్లేడు వల్ల ఎయిడ్స్

పవిత్ర క్షేత్రమైన తిరుమలలో తల నీలాలు సమర్పించే భక్తులకు అక్కడి క్షురకులు ఒకే బ్లేడు వుపయోగిస్తున్నారు. పలువురికి ఒకే బ్లేడు వుపయోగిస్తే 'ఎయిడ్స్' వ్యాధి వచ్చే అవకాశం వుంది. కాబట్టి భక్తులు కొత్త బ్లేడును గూర్చి డిమాండ్ చేయడమో లేక తామే కొనుక్కొని వెళ్లడమో చేయాలి.

నెల్లూరు– డాక్టర్ ఇ. రాజగోపాల్ రెడ్డి

## జ | న | వా | ణి

## సారా నిషేధం అమలౌతుందా?

మహమ్మారి సారాను నిషేధించి ప్రభుత్వం మంచి పని చేసింది. ఇదే విధంగా గతాన 1949 - 69 కాలంలో ప్రొహిబిషన్ విధించినపుడు సంభవించిన పరిస్థితులను ఒకసారి సింహావలోకనం చేసుకోవాలి. ఒకటి మాత్రం నిజం. అప్పటి కన్నా ఇప్పుడు నైతిక విలువలు ఎంతో దిగజారి పోయాయి. చట్ట వుల్లంఘన మంచి నీళ్ల ప్రాయమై పోయింది. చట్టం ద్వారా ప్రభుత్వం, ఎక్సైజ్ పోలీసులు సారా అమ్మకాలు నిలుపుదల చేస్తారన్నది కల. తాగుబోతుల ఆత్మ విమర్శ, వుద్యమ కారులు నచ్చ చెప్పే తీరు దొంగ సారాను అడ్డుకునే ప్రజల నిజాయితీల పై నిషేధం విజయవంతమా? విఫలమా? అనే విషయాలు ఆధార పడతాయి.

గూడూరు – ఆవుల కొండయ్య

## సినిమాలకిచ్చే రాయితీలు నాటక రంగానికి ఇవ్వండి

గత వారం 'జమీన్‌రైతు' సంచికలో సినిమా రాయితీల పై

కొరవ 8 వ పేజీలో

# అంతర్జాతీయ ఆటలు చూసే అదృష్టం ఎప్పుడు కల్గుతుందో?

ప్రస్తుతం స్టేడియంలో 8 మంది కోచ్‌లు వున్నా వారంతా పనిలేక గోళ్లు గిల్లుకుంటూ కూర్చుని వున్నారనే చెప్పవచ్చు. వివిధ క్రీడా సంఘాలకు కోచ్‌లకు వున్న మనస్పర్థలే దీనికి కారణం. క్రీడాస్ఫూర్తిని కోచ్‌లు కల్గించడం లేదని క్రీడాసంఘాలు ఆరోపిస్తే, తగిన సహాయ సహకారాలు సంఘాలు అందించడంలేదని కోచ్‌లు చెబుతారు. ఏదైతేనేం ఇద్దరి మధ్య అవగాహనా లోపం వల్ల అంతంత మాత్రంగా అభివృద్ధి చెందుతున్న క్రీడాస్థాయి మరింత అధః పాతాళానికి దిగజారి పోతూంది. ఆటగాళ్ల స్వయం ప్రతిభ వల్ల 70వ దశకం మొదటి నుండి 1989 వరకు జిల్లా ఫుట్ బాల్ జట్టంటే రాష్ట్రంలోని అన్ని జట్లు హడలి పోయేవి. గ్రామీణ, సీనియర్, అంతర్ జిల్లా పోటీలలో విజేతలుగా నిలచి హెచ్చ పేరు ప్రఖ్యాతులు తెచ్చారు. కాని అసోసియేషన్, క్రీడాకారుల మధ్య ఎంపిక విధానంలో ఏర్పడిన అపశృతి కోర్టుల వరకు వెళ్లి ఆ క్రీడ మరుగున పడేలా చేసింది. దీని వల్ల ప్రస్తుతం స్టేడియంలోని ఇద్దరు కోచ్‌లకు కావల్సినంత తీరిక దొరికింది. అదే విధంగా వాలీబాల్ క్రీడలో ప్రోత్సాహం కరువై నెల్లూరు, అల్లూరు క్రీడాకారులు మరుగుజ్జాలుగా మిగిలి పోయారని వయసు మళ్లినా పుత్సాహం పుట్టిపడే వాలీబాల్ కోచ్ ఆవేదన చెందుతుంటారు. కాని కోచ్‌లో సామర్థ్యమున్న క్రీడాకారులను వెతికి పెట్టాలనే స్పృహ మాత్రం వీరిలో కలుగదు.

జిల్లాలోని ఏ అసోసియేషన్ను కోరినా తమ కోచ్‌లు వెళ్లి శిక్షణ ఇస్తారని చెప్పే ఇన్‌ఛార్జ్ కోచ్ రవి జిల్లా ప్రజలకు క్రీడల మీద పుత్సాహం లేదంటారు. నెల్లూరు విద్యా వసతి కేంద్రంగా పరిఢవిల్లడమే దీనికి కారణమట. ప్రకాశం జిల్లాలో వైశాల్యం గల ఆట స్థలాలు లేక పోయినా మార్టూరు వంటి చిన్న గ్రామాల్లో సైతం జాతీయ స్థాయి పోటీలు జరిగాయి. మరి అటువంటి ప్రోత్సాహం నెల్లూరు లోపించిం దంటారాయన. అందుకే ఈసారి జిల్లా బాల బాలికల్లో స్ఫూర్తి కల్గించను 24 వేల్ల క్యాంపులు పెడతారట. రాష్ట్ర ప్రభుత్వ అనుమతి కూడా

> కోచ్‌లు,క్రీడా
> సంస్థల మధ్య
> తలెత్తే పేచీలతో
> క్రీడాకారులకు
> నిరుత్సాహం
> మిగుల్తూంది:
> నెల్లూరులో
> ఆటల పట్ల
> ఆసక్తి లేదనిచెప్పి
> తప్పించు కుంటున్నారు !

వచ్చిందంటున్నారు. వీటి కోసం ఖర్చు పెట్టను వివిధ పంచాయితీల నుండి సేకరించిన 70 వేల రూపాయలు సిద్ధంగా వున్నాయని చెబుతున్నారు. ఇవే గాక మే 1 తేది నుండి జూన్ 15 వరకు సమ్మర్ క్యాంపులు నిర్వహిస్తారట. నిర్వహించాలి కాబట్టి ఈ క్యాంపులు నిర్వహించడం తప్ప, ఈ క్యాంపులలో ప్రతిభ చూపిన క్రీడాకారులను పట్టించుకోవడం లేదన్న విమర్శ కూడా వీరి పై వుంది.

స్టేడియంకు సంబంధించి ఆశ్చర్య పరిచే విషయం ఏమిటంటే, శుభ్ర పరచడం, ఎత్తు పల్లాలు సరిదిద్దడం వంటి పనులకు ఒక్క వుద్యోగి లేరు. రాష్ట్రంలోని ప్రతి స్టేడియంకు గ్రౌండ్ మెన్లు, వాచ్‌మెన్లు, అసిస్టెంట్లు వున్నారట. స్టేడియం కొత్త భవనాలను ఇంతకు ముందు కలెక్టర్ శ్రీ కె. రాజా శ్రద్ధతో కట్టిస్తే, ఇప్పటి కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు చొరవ తీసుకొని ప్రపంచ బ్యాంకు ఎస్.ఇ. ఆఫీసుకు పై పోర్షన్ అద్దెకి తీసుకొనేలా చేశారు. ప్రస్తుతం అద్దెగా వచ్చే డబ్బుతోనే స్టేడియంలో అడపా, దడపా పనులు చేపడుతున్నారు. 400

కొరవ 10 వ పేజీలో



తిక్కవరపు రామిరెడ్డి జయంతిసభలో, రొటేరియన్ కొండా బలరామిరెడ్డి నుంచి సత్కారం స్వీకరిస్తున్న డాక్టర్ జె.వి. సుబ్బరాయుడు; ప్రక్కన బెజవాడ గోపాల రెడ్డి, పివి రమణా రెడ్డి, జె.వి. రెడ్డి, దుగ్గిశెట్టి రమణయ్య, గోసుకొండ.

## సణుగుడు

### అంత పెద్ద సంపాదకులుండే పత్రికల్లో అంత నీచమైన బూతులా?

''అమ్మాయి రొమ్ములు పెద్దగా వుంటాయి. పరిగెత్తి స్తే చెంగు చెంగున గెంతుతాయి. అమ్మాయి తొడలు లేత అరటి బోదెల్లా వుంటాయి. చెక్కెక్కి స్తే కక్కుక్కి స్తాయి. అమ్మాయి జఘనం ఘనంగా వుంటుంది''.

''కనక్ చూపులు, అర్ధ స్మాటిక్ పెదవి విరుపులు, స్వింగింగ్ బ్రెస్ట్, వయలెంట్ జర్క్స్ మగవాణ్ణి వొక వొక అవయవంగా మార్చేస్తాయి. అడ తోలు బొమ్మలకి అవయవాలు తప్ప మరేమీ వుండవు'' ''అమ్మాయికి పెళ్లయితే ఎలా? కన్నెపొర చిట్లి పోతే ఎలా? ప్రేక్షకులకు మాస్టర్బేషన్ కుదిరేనా? సినిమా థియేటర్లు హస్త ప్రయోగాలకు ఫోర్ ప్లే గ్రౌండ్లు''.

అటక మీద దొరికిన పాత కాగదా పత్రిక వ్రాతలు కావివి; ఆరు కోట్ల ఆంధ్రుల అభిమాన పత్రికగా ప్రచారంలో వుండే ఆంధ్రజ్యోతి దిన పత్రిక ఆదివారం అనుబంధం (18.4.1993) లోని కామ పైత్యం ఇది. చచ్చిపోయిన దివ్యభారతికి కె. శ్రీనివాస్ అనే మానసిక దౌర్బల్యుడు సమర్పించిన శ్రద్ధాంజలి ఇది. స్త్రీని అడ తోలు బొమ్మగా, ఆ తోలు బొమ్మలూ అవయవాలు తప్ప మరేమీ లేనివిగా పూహించుకునే నీచ ప్రవృత్తి ఆ రచయితకి వుంటే వుండవచ్చు గాని ఆంధ్రజ్యోతి వంటి దినపత్రికలో ఆ చెత్త వ్రాతలు ప్రచురితం గావడమే దురదృష్టకరం; బాధాకరం.

తెలుగు దిన పత్రికలలో ఆంధ్రజ్యోతిది ప్రత్యేక స్థానం. వ్యాపారమే సర్వస్వంగా నడిచే పత్రికలకు భిన్నంగా, పాత్రికేయ ప్రమాణాలను పాటిస్తూ, వార్తా విలువలను కొద్దో గొప్పో కాపాడు కుంటూ వస్తున్న పత్రిక అది. పాత్రికేయ ప్రపంచంలో అత్యంత గౌరవం, ప్రతిష్ఠ పొందాతనం, ప్రతిభ, మేధో సంపత్తి కల్గిన నండూరి రామ మోహన రావు గారి సంపాద కత్వంలో వెలువడుతున్న పత్రిక అది. అటువంటి పత్రికలో ఇటువంటి

**దోలేంద్ర**

బూతు వ్రాతలు, నీచ భావాలు కన్పడితే మనసుకు ఎంత కష్టంగా వుంటుంది?

పాఠకుల చేత చదివించ డానికి, సర్క్యులేషన్ పెంచు కోవడానికి జుగుప్సాకరమైన బూతు వ్రాతలు వ్రాయడమొక్కటే మార్గమన్న దౌర్భాగ్య ప్రవృత్తి పత్రికా యాజమాన్యాలలో పెరిగి పోతున్నది. నగటు ప్రేక్షకుడిని ఆకర్షించడం కోసం చవక బారు సినీ నిర్మాతలు, దర్శకులు తారామణుల గుడ్డలు విప్పి, అంగాంగాలు ప్రదర్శింప జేసినట్లు – సంపాదకులు తమ పత్రికలలో స్త్రీ అవయవాలను నోరూరేట్లు వర్ణిస్తున్నారు. పాత కాలంలో యువతరం నరాలు పురి పెట్టడానికి రమణి, మదన వంటి ప్రత్యేక పత్రికలుండేవి. దొంగ చాటుగా కొని, రహస్యంగా చదివి ఆనందించే వారు. ఇప్పుడా శ్రమ లేదు. మామూలు సినిమా మధ్య బ్లూ ఫిలిం రీళ్లు ఇరికించి ప్రదర్శించినట్లు సాధారణ పత్రికలలోనే జుగుప్సాకర శృంగారం కొప్పించి ఇంటింటికీ ఫ్రీగా సరఫరా చేస్తున్నారు. ఆంధ్ర జ్యోతి వంటి ప్రతిష్ఠాకరమైన పత్రికలకూ ఆ దౌర్భాగ్యం సంక్రమించడం తెలుగు జర్నలిజం చేసుకున్న దురదృష్టం; ఈ ఒక్కసారే కాదు – వారికిది అనవాయితీ

కొరవ 8 వ పేజీలో

## సరస్వతికి మరణశిక్ష అమలౌతుంది

**సి. నారాయణ రావు**

విలువిద్యలో–
విషమ పరీక్షలో–
విశ్వమే విశ్వవిద్యాలయంగా
విద్యార్థి తానుగా
విప్రుని మట్టిబొమ్మ గురువుగా
ఏకలవ్యుడు విలుకాడయ్యె
ఏకబిగిన ఉత్తీర్ణుడయ్యె
అక్కడ పరీక్ష లేదసలు
అకుంఠిత దీక్ష తప్ప!
ప్రశ్నాపత్రాలు కన్పించవు
పట్టుదల పరిశ్రమలే తప్ప!
కట్టుబాట్లు లేకున్నా
కఠోర నియమ నిష్ఠల కాతడు బంది!
ఇది గతం బోధించిన తత్వం
నిన్న–
ప్రశ్నపత్రాల లీక్
ఈ రోజు–
పరీక్షల వాయిదా కై హైజాక్,
రేపు–
కోరుకున్న మార్కులకై కిడ్నాప్
ఇదే ఈనాటి విద్య నేర్పిన
ఆధునికత్వం
ఇక్కడ దీక్ష కన్పించదు
పరీక్ష కోసం ప్రలోభం తప్ప!
పరిశ్రమ అసలే కన్పించదు
మార్కుల మాయజాలం తప్ప!
విద్యార్జన లక్ష్యమసలే కన్పించదు
ర్యాంకుల కోసం సిలబస్‌ల ఉరుకులు
పరుగులు తప్ప!
ఎన్ని కట్టుబాట్లు ఉన్నా
ఏకలవ్యులు మాత్రం సున్నా!
పట్టపగలే చదువుల తల్లిపై
'హత్యా' చారం
విద్యార్థుల భవితవ్యం
ఇక సుదీర్ఘ ప్రశ్నార్థకం?
సరస్వతి ఈ రోజు
మౌనంగా రోదిస్తున్నది
ఆమెకు–
మరణ శిక్ష అమలవుతున్నది

## కారు చౌకకే కిక్కిచ్చే విదేశీ మందు!

ప్రభుత్వం సారాయిని నిషేధించిందన్న మాటే గానీ దాని స్థానంలో స్వదేశంలో తయారయ్యే విదేశీ మద్యం విస్కీ, బ్రాందీ వంటి మత్తు పానీయాల్ని కాదు చౌకకు ప్రజలకు అందించేందుకు పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేస్తున్నది. అంటే ప్లాస్టిక్ సంచుల్లో సరఫరా చేసే తెల్లసారాకు కాస్తంత రంగు పులిమి సీసాల్లో సరఫరా చేస్తుంది.సారాయి వ్యాపారం మానుకొని బ్రాందీ, విస్కీ, రమ్, జిన్ వంటి కాస్తంత ఖరీదైన వ్యాపారాన్ని చేపట్టబోతూంది. పైకి సారాయి నిషేధిందామని గొప్పలు చెప్పుకుంటున్న ప్రభుత్వం విదేశీ మద్యం ముసుగులో జనాన్ని మభ్యపెడుతూ హుషారెత్తించే 'కిక్కు' సరఫరాకు రంగం సిద్ధం చేస్తోంది.

> విస్కీ, బ్రాందీల వ్యాపారం
> చేపడితే సారాయిలో పోయే
> డబ్బుకు రెట్టింపు ప్రభుత్వ బొక్కసానికి
> చేరుతుంది!
> ప్రజల తలసరి ఆదాయంలో
> సగం మత్తుకే ఖర్చువుతుంది!

మన రాష్ట్రంలో స్వదేశీ, విదేశీ మత్తుపానీయాలు సగటున రోజుకు పదిహేను కోట్ల రూపాయల మేరకు అమ్ముడు పోతున్నాయంటే ఆశ్చర్యంగా వుంది కదూ! కాని ఇది నిజం 1991 - 92 లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో ప్రజల తలసరి ఆదాయం 1840 రూపాయలు కాగా అందులో 830 రూపాయల వరకు మద్యపానానికే ఖర్చవుతున్నది. రాష్ట్రంలో ఏటా 5,400 కోట్ల రూపాయల విలువ చేసే మద్యం వ్యాపారం జరుగుతోంది. ఇందులో స్వదేశంలో తయారయ్యే విదేశీ మద్యం (ఐఎమ్ఎఫ్ఎల్) వ్యాపారం 3,872 కోట్ల రూపాయలు కాగా, స్వదేశీ మద్యమైన సారాయి వ్యాపారం 1350 కోట్ల రూపాయలు మాత్రమే. అయితే ఇందులో చిన్న కిటుకు వుంది. ఐ.ఎమ్.ఎఫ్.ఎల్ వ్యాపారం 3,872 కోట్లు వున్నా దాని

కొరవ 8 వ పేజీలో

ఈ అహల్యకు శాపవిమోచనం కల్గించే రాముడెవరో!

# సూళ్లూరుపేట ఆర్టీసీ బస్టాండు ఎప్పటికీ కలేనా?

కాలు తగిలించి రాయిని అహల్యగా మార్చగల రామచంద్రులు మనకిప్పుడు లేరు కాని, అటువంటి వారెవరైనా వుంటే అర్జెంట్‌గా తమ వూరికి తీసుక వెళ్లి, మహిమ ప్రదర్శించమని మనవి చేసుకోవాలని వుందని సూళ్లూరుపేట పౌరులు ఆశ పడుతున్నారు. వూరికి ఉత్తరాన, చెరువు పోరంబోకు స్థలం పైదికి, పదేళ్ల క్రితం ఆర్టీసీ బస్టాండుకు శంకుస్థాపన చేశారక్కడ. అదెంతటి మహత్తర ముహూర్తమో కాని ఆ పునాది రాయి సమాధి రాయి వలెనే చూపరుల వైపు జాలిగా చూస్తూ నిలబడి వుంది ఇన్నేళ్ల కాలం. శంకుస్థాపన చేసిన వారు నిర్మాణం ఎందుకు చేపట్టలేరో తెలియదు. ఆలస్యం జరిగే కొద్దీ అర్థంకులూ పెరుగుతున్నాయి. స్థలం పంచాయితీది. అప్పట్లో ఆర్‌టిసికి ఇవ్వడానికి పంచాయితీ అంగీకారం తెల్పింది. ఆ తర్వాత ఏమి బుద్ధి పుట్టిందో, పంచాయితీ సభ్యుల్లో కొందరు అభ్యంతరం చెప్పి, కోర్టులో స్టే తెచ్చారు. విలువైన ఈ స్థలాన్ని ఉచితంగా ఆర్‌టిసికి ఎందుకివ్వాలన్నది వారి వాదన. ఆర్‌టిసి కూడా దొరికిందే సాకని నిర్మాణపు పని ప్రక్కన పడేసింది. వారిలో సంకల్పం వుంటే ఎదో ఒక రేటు మాట్లాడుకొని సమస్య పరిష్కరించు కోవచ్చు. ఇంకొక ప్రక్క స్థలం చెరువు మధ్యలో వుండడంతో దాన్ని లెవల్ చేయడానికి లక్షలు ఖర్చు పెట్టాల్సి వుంటుందన్నది ఒక అభ్యంతరం. ఆ మట్టికయ్యే ఖర్చుతో మేమింకొక బస్ స్టేషన్ కట్టుకోవచ్చు నంటారు ఆర్‌టిసి అధికారులు.

కారణమేమైనప్పటికీ నిర్మాణం మాత్రం నిల్చి పోయింది. మంత్రి పెంచలయ్య అయినా ఈ సమాధి రాయికి శాప విమోచనం కల్గిస్తే రాముడంతటి వాడని సూళ్లూరు పేట వాసులు అభినందిస్తారు.

## గూడూరు రైల్వే స్టేషన్‌లో గొడవ

మద్రాస్ నుండి అహమ్మదాబాదు వెళ్లే నవజీవన్ ఎక్స్‌ప్రెస్‌లోని కేటరింగ్ హెల్పర్లకు, గూడూరు స్టేషన్‌లోని వెండర్లకు మధ్య 18 తేది జరిగిన గొడవ చిలికి, చిలికి గాలి వానయ్యింది. ఇరు వర్గాల వారూ సోడా సీసాలు, రాళ్లతో పరస్పర దాడులకు దిగడంతో ప్లాట్ ఫారం పై భయానక వాతావరణం నెలకొంది.




గొడవకు మూలమేమంటే సందయ్య అనే వ్యక్తి రైలులో కాఫీ అమ్మకూడదని హెల్పర్లు దబాయించడం, వారి మధ్య వాగ్వివాదం తరువాత చేయి చేసుకోవడం జరిగింది. ఈ విషయాన్ని సందయ్య తన మిత్రుడు సుధాకర్‌కు చెప్పి విచారించను వెళ్లితే అతన్ని కూడా కొట్టారు. దీనితో రెచ్చిపోయిన వెండర్లు ప్లాట్ ఫారం పక్కన వున్న కూల్ డ్రింకు షాపుల్లోని సోడా సీసాలకు పనిచెప్పారు. ప్రయాణీకులు భయపడి రైలు కిటికీ తలుపుల్ని మూసుకొన్నారట. అప్పటి వరకు నిద్రపోతున్న రైల్వే పోలీసులు మేల్కొని 7 గురిని అదుపులోకి తీసుకోవడంతో పరిస్థితి చక్కబడింది.

కావలి కమీషనర్ గదిలో బందీలైన దేముళ్లు

# మునిసిపాలిటీకి దేముడి స్థలం తప్ప ఇంకేమీ కన్పడలేదా?

కావలి వెంగళ రావు నగర్‌లోని రాముడు, శివుడు, షిర్డీ సాయి బాబా బందీలై పోయారు; మునిసిపల్ కమీషనర్ గదిలో ఖైదు అనుభవిస్తున్నారు. వెంగళ రావు నగర్‌లోని ఒక మారు మూల ప్రదేశంలో, రాళ్లు రప్పలతో నిండిన కొద్ది జాగాను స్థానికులు కొందరు శుభ్రం చేసి, ఒక పూరి పాక వేసి, దానిలో పై ముగ్గురు దేముళ్ల పటాలు పెట్టి, పూజిస్తుండినారు. మొన్న శ్రీరామ నవమికి అక్కడ ఉత్సవాలు కూడా జరిగాయి. భజనలు, అధ్యాత్మిక ఉపన్యాసాలు కూడా జరిపిస్తున్నారు. చందాలు దండి అక్కడొక సాయిబాబా గుడి కట్టించాలన్నది వారి సంకల్పం. ఉన్నట్లుండి మొన్నొక రోజు మునిసిపల్ అధికారులు ఈ గుడిపై దాడి చేసి, పాక పీకి పారివేసి, దేముళ్ల ముగ్గుర్నీ బంధించి, తీసుక వెళ్లారట. అవి మామూలు పటాలే కావచ్చు కాని, పూజలో వున్న వాటిని మూలవేయడం తమ దృష్టిలో అపచారమని ఆ గుడి నిర్వాహకులు గగ్గోలు పెడుతున్నారు.

ఈ గుడి వుండేది మునిసిపాలిటీ స్థలమే; అయితే అది వూరికి దూరంగా, నిరుపయోగంగా వుంది. టౌన్‌లోని మెయిన్ బజార్‌నే శక్తి వున్న వారు ఆక్రమించి భవనాలు లేపేస్తున్నా; బంకులు పెట్టి ఆక్రమిస్తున్నా మునిసిపాలిటీ అడిగిన పాపాన పోనప్పుడు, వూరికి దూరంగా వుండే ఈ స్థలం పై ఎందుకింత ప్రతాప మన్నది వారి ప్రశ్న. ఎవరో రాజకీయ వాదులు ఈ స్థలం పై కన్నేసి ఈ దౌర్జన్యం చేయించారన్నది వారి అనుమానం.

తరువ 7 పేజీలో



సూళ్లూరు పేట కళంగి రాజ గోపాలశెట్టి విగ్రహా విష్కరణతో ఎమ్మెస్ రెడ్డి, మంత్రి పసల పెంచలయ్య

# నెల్లూరు నలుచెరగుల్లో

విహార్మికుడు

## పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీ పనబ పెంచలయ్య 23 తేదీ నెల్లూరు వస్తారు; 28 వరకు జిల్లాలోనే వుంటారు.

## హై కోర్టు జడ్జి

హై కోర్టు జడ్జి జస్టిస్ శ్రీ జ. పాండు రంగా రావు మే 2 తేదీ నెల్లూరు వస్తున్నారు. బార్ అసోసియేషన్ వార్షికోత్సవంలో పాల్గొంటారు.

## మంచి నీటి కటకట

ఎండలు ఆలస్యంగా ముదిరినా, మంచి నీటి కరువు మాత్రం ముందుగానే ముంచుకొని వచ్చింది. సోమశిలలో నీటి మట్టం కనీస స్థాయికి పడిపోవడం దీనికి కారణం కావచ్చు. మెట్ట ప్రాంతాలలో బావులు ఎండి పోతున్న వార్తలు నిత్యం వస్తున్నాయి. కలెక్టరు గారు ఈ సమస్య పై స్పెషల్ టాస్క్ ఫోర్సు ఏర్పాటు చేశారు. జాయింట్ కలెక్టర్, ఆర్డీఓ, ఎమ్మార్వోలు ఈ విషయం పైనే తమ దృష్టిని, సమయాన్ని అధిక భాగం వెచ్చించాలని ఆదేశించారు. నిధులూ ఎన్నో తంటాలు పడి సర్దుబాటు చేస్తున్నట్లుంది. నెల్లూరు టౌన్‌లోనూ మంచి నీటి కొరత కన్పడుతూంది. మేలో నాలుగు చినుకులు పడితే తప్ప ఈ సమస్య పరిష్కారం కాదు.

## టెలిఫోన్ల బాధ వద్దు బాబూ వద్దు!

రోజులు గడిచే కొద్దీ టెలిఫోన్ సర్వీస్ మెరుగు కావలసింది పోయి, నెల్లూరులో దినదినానికి పరమ అధ్వాన్నమై పోతున్నది. టెలిఫోన్ పెట్టుకోవడం ఒక పాపంగా, నేరంగా భావించి చేసిన తప్పుకు చెంపలేసుకోవలసి వస్తున్నది. నెలలో పది రోజులైనా బాగుండడం లేదు; రోజులో ఒక గంట పాటైనా సక్రమంగా వుండడం లేదు; పది రోజులు పలికితే ఇరవై రోజులు మూగబోతున్నవి; ఒక గంటలో బాగుంటే మరో గంటలో చెడిపోతున్నవి; లోకల్ కాల్స్ విషయం పోనివ్వండి. ట్రంక్ కాల్స్ సైతం మధ్యలో కట్ అయిపోతున్నవి. ఎస్.టి.డి. కాల్సు దుస్థితి అంతే. గుర్రం గుడ్డిదైనా దాణాకు తక్కువ లేదన్నట్లు ఈ గుడ్డి చెవిటి మూగ టెలిఫోన్ల బిల్సు మాత్రం తక్కువ కావడం లేదు. వద్దు బాబు ఈ టెలిఫోన్ల బాధ అనే విరక్తి కలుగుతున్నది.

చెడి పోతే చెప్పినా దిక్కు దివాణం వుండడం లేదు. ఇంజనీర్లకు చెప్పినా, ఇంకా పై ఆఫీసర్లకు చెప్పినా వారికి, చెప్తే మాకు భయమా అని మొహాయించుకునే వుంటున్నాయి. అసలు చెడిపోయిందని చెప్పాలంటే టెలిఫోన్ అధికార్ల ఫోన్లే చెడి పోయి వుంటున్నాయి. ఒక వేళ బాగుండి, అధికార్లు దొరికి, లైన్ మాన్‌ను పంపినా ఆయన వచ్చి చూచి అది ఇది కలిబెట్టి మళ్లీ వస్తానని పోతారు జక అదే పోక!

ప్రజా ప్రతినిధులున్నారు; ముఖ్యంగా పార్లమెంటు సభ్యులున్నారు. టెలిఫోన్ వినియోగ దారులు ఈ విధంగా అసౌకర్యానికి, నష్టానికి గురియౌతుంటే పెదవి విప్పి ఒక్క మాట మాట్లాడరెందు వల్ల? ఎం.ఎల్.ఎ.లు నోరెత్తరే! వీరందరూ వుండేదెందుకు – సభల అలంకారానికా? టెలిఫోన్ వినియోగ దార్ల సంఘం అంటూ ఒకటుండి, దాని అడ్రసు తెలియడం లేదు! ఆందోళన అలజడి లేకుంటే ప్రభుత్వానికి వినబడదు. ఈ సత్యం మీకు తెలియనిదా!

## మ్యూజిక్‌లో స్వర్ణ పతకం

తిరుపతి మహిళా విశ్వవిద్యాలయం సంగీతం పరీక్షలలో మొదటి ర్యాంకు తెచ్చుకొని మొన్న 17 తేది స్నాతకోత్సవంలో గవర్నరు శ్రీ కృష్ణకాంత్ నుండి స్వర్ణ పతకం అందుకున్నదట మన నెల్లూరు విద్యార్థిని ఏ. హేమ లక్ష్మి. ఈమె మద్యపతి వారి వీధి వాసి శ్రీ పాలేటి కోటయ్య కుమార్తె.

పేరు బంగారు. వచ్చిన పతకమూ బంగారుది. హేమలక్ష్మికి మా అభినందనలు.

## సారా నిషేధం- ఎక్సైజ్ ఆర్భాటం

జిల్లాలో సారా నిషేధం అమలుకు ఎక్సైజ్ శాఖ పెద్ద ఆర్భాటమే చేస్తున్నది. రాష్ట్రమంతటి నుంచి అధికార్లను, సిబ్బందిని రప్పించి మొహరిస్తున్నారు. ఇప్పటి వరకునలుగురు అసిస్టెంట్ కమీషనర్లు, 10 మంది ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికార్లు, 25 మంది వరకు సాధారణ అధికార్లు నెల్లూరు వచ్చి వున్నారు. హైదరాబాదు, గుంటూరు, విజయవాడ, కర్నూలు వంటి చోట్ల నుంచి వీరిని తరలించారు. ఆ జిల్లాల నుంచి 10 అదనపు వాహనాలు కూడా వచ్చాయి. పల్లెల్లో, టౌన్‌లో కూడా మైకులు పెట్టి సారాయి త్రాగడం, అమ్మడం నేరమని ప్రచారం చేస్తున్నారు. నిషేధానికి ప్రజలు అలవాటు పడాలని కాబోలు ఇప్పటి వరకు దాడులు, అరెస్టులు పెద్దగా జరగలేదు. ఇతర జిల్లాల నుంచి దొంగ సారాయి తరలి రాకుండా అన్ని సరిహద్దుల రోడ్లలో గస్తీ తిరుగుతున్నారు. సారా కాంట్రాక్టర్లు కూడా తొందర పడకుండా పరిస్థితి గమనిస్తున్నట్లుంది. నెల్లూరుకు సంబంధించి నంత వరకు ఇతర జిల్లాల నుంచి దొంగ సారా రావలసిన అవసరం లేదు; లోలోపలే పుష్కలంగా సారా కాయగల సమర్థులున్నారు మనకు. ఎక్సైజ్ శాఖకు, వీరికి మధ్య యుద్ధం ప్రారంభం కాబోతుంది.

## ఎర్రచందనం ఘర్షణలు

స్మగ్లింగ్ అవుతున్న ఎర్రచందనం విషయమై వెంకటగిరి ప్రాంతంలో ఘర్షణలూ ప్రారంభమైనాయి. పత్రికలకు, అడవుల అధికారులకు సమాచారం అందిస్తున్నారనే అనుమానంతో స్మగ్లర్లలోని వివిధ వర్గాల వారు తరచు ఘర్షణ పడుతున్నారు. మొన్నొక రోజు వెంకట గిరి టౌన్‌లో వీరి కొట్లాటలు అరాజకం సృష్టించాయి. జమీన్‌రైతులో గతవారం వచ్చిన వార్త ఎవరు ఇచ్చి వుంటారనే విషయం పైన తగువు లాడుకుని, కొట్లాటకు దిగారట. వీధుల్లో అరుచుకుంటూ, తరుముకుంటూ, తన్నుకుంటూ వారు చేసిన ఆగానికి టౌన్‌లోని పౌరులు గడ గడ లాడి పోయారు.

పోలీసు, అటవీ శాఖ గట్టిగా వ్యవహరించ కుంటే ఈ దుర్మార్గం మితి మీరి పోయే ప్రమాదం వుంది.

## 'అంకుశం' కేసు

అంకుశం సినిమాలో జాతీయ పతాకాన్ని తిరగ త్రిప్పి చూపారన్న ఆరోపణలో గూడూరు న్యాయవాది ఒకరు అదనపు జిల్లా కోర్టులో దాఖలు చేసిన కేసు ఇంకా కొనసాగుతూనే వుంది. 28 తేది న్యాయమూర్తి సినిమా చూసి విషయం పరిశీలిస్తారు.

## గూడూరు దోపిడీ- కత్తిపోట్లు

ఈ మధ్య తగ్గు ముఖం పట్టి వుండిన బందిపోట్ల వీర విహారం మళ్లీ ప్రారంభమైంది. 22 తేది రాత్రి గూడూరు టౌన్ శివార్లలో బందిపోట్లు విరుచుక పడ్డారు. తిలక్ నగర్‌లో కోనేటి మోహన్ అనే వ్యక్తి ఇంటిపై దాడి చేశారు. ఆతడింట్లో రెండు బంగారు దండలు, గడియారం దోచుకున్నారు; ప్రక్కనే వున్న చిరదవోలు సుబ్బారెడ్డి ఇంటిపై దాడి చేశారు. ఏడు సవర్ల నగలు దొరికాయి. ఆ తర్వాత ఒక రిటైర్డ్ ఉద్యోగి ఇంటి తలుపులు పగుల గొట్టారు. వారిని చూచి అరచిన ఆ ఉద్యోగి భార్యను, ఆతడ్ని కూడా కత్తులతో పొడిచి, గొడ్డలితో కొట్టి యాభై వేలు విలువచేసే నగలు దోచుకున్నారు. అప్పటికీ తృప్తి కలుగక పొరుగున వున్న ఇందిరా నగర్‌పై పడ్డారు. వీరి అలికిడికి నిద్రలేచి అరచిన భవాని సింగ్ అనే యువకుడ్ని కత్తితో పొడిచి, ఇంటిలోని బీరువాను దూరంగా ఎత్తుకునెళ్లి, పగులగొట్టి దొరికిన వస్తే మూట కట్టుకున్నారు గంటన్నరకు పైగా వీరవిహారం చేసిన తర్వాత చీకట్లో మాయమైనారు.

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | | |
| | 9672 పాతవి | 3,500/- |
| | 9672 కొత్తవి | 3,000/- |
| | 9674 పాతవి | 3,800/- |
| | 9674 కొత్తవి | 3,200/- |
| ఐ.ఆర్. | 20 | 2,400/- |
| బియ్యం బస్తా | | 550/- |
| బంగారు సవర (8గ్రా) | | 3,360/- |
| వెండి (10 గ్రా) | | 58/- |

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-


జక్కా వెంకయ్య
(సి.పి.ఎం.)


ఎన్. ప్రసన్న కుమార్ రెడ్డి
(తెలుగుదేశం)


సి.హెచ్. వరదయ్య
(బి.జె.పి.)

# కోవూరు అభ్యర్థిత్వం

(మొదటి పేజీ తరువాయి)

ఇప్పుడు అటువంటి విషమ సంకట స్థితిలో పడి పోయి వున్నారు. ఆయన స్వభావాన్ని బట్టి తుది ఘడియ వరకు ఆయన అజ్ఞాత ప్రయత్నం వుంటుందని వూహించవచ్చు.

దేవ కుమార్ రెడ్డి దురదృష్టమేమో కాని, ఆయన అభ్యర్థిత్వానికి జిల్లాలో ముఖ్యమనుకునే వా[illegible]డు [illegible] సుముఖంగా లేరు. అతను వద్దు అని చెప్పే వారే గాని, పెట్టమని మాట సామెతకు సైతం అనే వారు లేరు. పదకొండు మంది శాసన సభ్యులుంటే కనీసం ఎనిమిది మంది అతని అభ్యర్థిత్వానికి ప్రతికూలురు. ప్రతికూలంగా వూరకుండడం కాదు, అతని



కాంగ్రెస్ అభ్యర్థిత్వాలకు రంగంలో వున్నవారు
సామంతు సుబ్బారెడ్డి — చేవూరు దేవకుమార్ రెడ్డి

అభ్యర్థిత్వాన్ని అన్ని విధాలా ప్రతిఘటిస్తున్నారు ; ఇంతెందుకు – సర్వం వొడ్డి పనిచేయ వలసిన మాగుంట వారికే అతని అభ్యర్థిత్వం పట్ల సుముఖత లేదు. ఒక్క జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి మాత్రం అనుకూలురేమో? కాని ఇంట్లో రామయ్య, వీధిలో కృష్ణయ్య అంటారే. దేవకుమార్ రెడ్డి అభ్యర్థిత్వం పట్ల ఆయన వైఖరి ఆ విధంగా వున్న దంటారు. యువకుడైన దేవకుమార్ రెడ్డి ఏ పదవికీ రాక ముందే ఇంత వ్యతిరేకత ఎందుకు కలిగింది? దానికి అతనొక్కడిదే తప్పుకాదు. ఆ చర్చకు ఇది సమయమూ కాదు, సందర్భమూ కాదు; మరోసారి మాట్లాడు కుందాం!

దేవకుమార్ కానప్పుడు కాంగ్రెస్ అభ్యర్థి ఎవరు? ముఖ్యమంత్రి మనసులో ఏముంది? జనార్ధన రెడ్డి ఏమి ఆలోచిస్తున్నారు? ఎం.ఎల్.ఏ. యానాదిరెడ్డి గారు ఇటువంటి సమయాల్లో ఆరాటంతో పరుగులు తీస్తుంటారు. ఇప్పుడు హైదరాబాదులో యానాదిరెడ్డి కోవూరు అభ్యర్థిత్వ నిర్ణయ బాధ్యతను తన నెత్తిన వేసుకొని మోస్తున్నారట. ఎవ్వరూ కోరి కాదు, తనకు తానుగా పూనుకోవడం ఆయన స్వభావం. ఆయన రాజాగా సామంతు సుబ్బారెడ్డి గారి పేరు ప్రతిపాదిస్తున్నారు; సుబ్బారెడ్డిని అక్కడ ఇక్కడ ముఖ్యులే అభ్యర్థిత్వం విషయం ప్రస్తావించినపుడు తనకు వీలు లేదని. తనకా వుద్దేశ్యం లేదని. తన కుటుంబ పరిస్థితులు అనుకూలంగా లేవని. అందువల్ల తాను పోటీ చేయలేనని స్పష్టంగా చెప్పారట. ఆ మాటలు కేవలం నాలుక మీద నుండి వచ్చినవని ఇప్పుడను కోవలసి వస్తున్నది. సుబ్బారెడ్డి గారికి ఇప్పుడు నోరూరినట్లుంది. తన అభ్యర్థిత్వం విషయంలో సిఫారసుకో, మరిదేనికో చక్కెర మంత్రి మహమ్మద్ జానీకి ఫోన్ చేశారని ఒక వార్త. కాటం రెడ్డి వెంకట రామి రెడ్యాదులు కూడా ఆయన అభ్యర్థిత్వం కోసం ప్రయత్నిస్తుండ వచ్చు. యానాదిరెడ్డి గారు సరేసరి అనుకోండి. ఎట్లయితే నేమి సామంతు పేరు ముఖ్యమంత్రి వరకు పోయినట్లుంది.

కాని ఆలోచనలో వున్న అభ్యర్థులలో ఈయన చివరి వాడే గాని, మొదటి వాడు కాదని విషయజ్ఞుల వర్తమానం.

సూత్రధారులైన మాగుంట వారు హైదరాబాదులో నుయ్యి గొయ్యిలను గూర్చి ఆలోచిస్తూ ఒక స్పష్టమైన నిర్ణయానికి రాలేక మధన పడుతూ వున్నట్లుంది. వారి మనసుల్లో అభ్యర్థి పేరు ఇంకా ఖరారు కాకుండా వుంటుందని మేమనుకోము; కాని బయట పడలేదు. మాగుంట శ్రీనివాసులు రెడ్డి గారుంటారని వదంతి గుప్ మంది. కాని ఆయన దానికి విముఖుడని వెంటనే మరో మాట. అన్న ఎం.పి.గా వున్నాడు కాబట్టి తమ్ముడు కూడా రాజకీయ బురదలో ఇరుక్కోక పోవచ్చు. ప్రస్తుతం వున్న గ్లామర్‌లో కాకి చేత కబురంపినా కాదనే వాడు లేడు. వారి పేరు పెట్టుకున్న అభ్యర్థి ఎవరైనా విజయాన్ని ముందుగానే చాటుకోవచ్చు నంటారు. అటువంటప్పుడు తమ పలుకుబడిని ఇతరులకు వుపయోగించే బదులు, తమ వాడొకరికి వినియోగిస్తే మంచిది గదా అనే ఆలోచన వారిలో ఎందుకు కలుగ కూడదు అని ఒకరి ప్రశ్న. ఈ నేపథ్యంలో మాగుంట సంస్థానపు మహామంత్రి పి.వి. ప్రసన్న పేరు వెలుగులోకి వచ్చింది. అతను ఆ నియోజక వర్గంలోని వాడు; బంధువర్గం కలిగిన వాడు. బహు పరిచయస్తుడు. వివాద రహితుడు. విద్యార్థికుడు, డబ్బు దర్పం వెతుక్కోవలసిన అవసరం లేని వారు.

ఇప్పుడు అభ్యర్థిత్వానికి ఇంకేమి అర్హతలు కావాలి? అన్నీ అనుకూలిస్తే ఎక్కువ అవకాశమున్న వారిలో ప్రసన్న రెడ్డి ముఖ్యుడు.

కాంగ్రెస్ అభ్యర్థిత్వం కోసం మరో యువకుడు గోడ మీద నుండి దూకి నట్టు హఠాత్తుగా రంగంలో తళుక్కు మంటున్నారు. ఆయన పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి కుమారుడు వసంత కుమార్ రెడ్డి; ఇంజనీరింగు పట్టభద్రుడు; రాజకీయాలకు పుట్టు కొత్త; పాదరసం కంటె చురుకు దనము, తుపాకి గుండు కంటె ఎక్కువ వేగంగా ఎక్కడికైనా, ఎవరిలోనైనా దూసుక పోగల చొరవ కలిగిన వాడు; 'క్లీన్‌షీట్' గలిగిన వాడు; వ్యక్తిత్వం వున్న వాడు; ప్రధాని పి.వి.కి తెలిసిన వాడు ఆయన కుమారులకు స్నేహితుడు. వసంత్ అభ్యర్థిత్వం ఆయన తండ్రి ద్వారా వచ్చింది కాదు; ఆయన ప్రోత్సాహంతో వచ్చింది కాదు; ఆయన ప్రమేయం అసలే లేదు; ఆయన ఆనందంగా చైనా విహారంలో వున్నారు; కోవూరు కాంగ్రెస్ అభ్యర్థి కావాలనే నిర్ణయం వసంత్ స్వంతం. అది విన్నప్పుడు మాకే ఆశ్చర్యం కలిగింది. వసంత్ అభ్యర్థిత్వం ఈనాడు అందరి నోళ్లలో నానుతున్నది. సర్వత్రా అనుకూలత వ్యక్తం అవుతున్నది. ఇంటలిజెన్స్ శాఖ వారు కూడా వసంత్ అభ్యర్థిత్వానికి ప్రథమ స్థానం ఇస్తూ రిపోర్టు పంపించారంటే అతని అభ్యర్థిత్వం ఇంత ముందుకు త్రోసుకొని వచ్చివుందా అనిపిస్తుంది.

వసంత కుమార్ రెడ్డి రాజకీయాలకే కాదు, ఎన్నికల రంగానికి కూడా కొత్త. కొత్తదనమే ఒక విధంగా మేలనుకున్నా; ధనం పనిజేసే మనుషులు, పర్యవేక్షించే వారు కావాలి. ఎవరైనా అనుభవ పరుల సహాయ సహకారాలుంటే తప్ప ఒక్కడు యిగ్గ లాడడం కష్టమే?

ఇదీ కాంగ్రెస్ అభ్యర్థులుగా ప్రస్తావనలో వున్నవారు. వెలుగులో కనపడుతున్న వారు వీరు. అదృష్టం ఎవరిని వరిస్తుందో, ఢిల్లీ ఎవరిని కరుణిస్తుందో కని, అదివారాలకు గాని తెలియక పోవచ్చు. అభ్యర్థి నిర్ణయం మాత్రం హైదరాబాదు నుండి ఢిల్లీకి పోతున్నట్లు తెలుస్తున్నది.

కాంగ్రెస్, కాంగ్రెసేతర పార్టీలు అభ్యర్థుల బలాబలాలు ఓట్ల విశ్లేషణ వచ్చే వారం ముచ్చటించు కుందాం.

– పరిశీలకుడు

## జిల్లా వార్తలు

(5 పేజీ తరువాయి)

కమీషనర్ గారూ – గుడి పేరుతో స్థలం దూరాక్రమించడం తప్పు కావచ్చు కాని, ఆ స్థలం ఎవరికీ పనికి రానప్పుడు, ఎవరికీ ఇబ్బంది లేనప్పుడు గుడికి వుపయోగ పెట్టుకోవడంలో దోషం లేదు కదా! ఆలోచించండి!

## పాణ్యం

మొదటి పేజీ తరువాయి

ఊరేగించిన వాళ్లు ఇప్పటికైనా వచ్చి తప్పయి పోయిందని కాళ్లు పట్టుకుంటే క్షమిస్తామని" కోట్ల వారు ఉదారంగా సెలవిచ్చారు కూడా. తెలుగుదేశం పార్టీ తనకు ప్రత్యర్థి కాదని, ఎన్నికల కమీషన్ చీఫ్ శేషన్ మాత్రమే తన ప్రత్యర్థని చెప్పుకున్నారు. ఎన్నిక తనకూ, తెలుగుదేశంకు మధ్య గాక శేషన్‌కు తనకు మధ్య జరిగిందని అన్నారు. తెలుగుదేశం అభ్యర్థికి 35 వేల ఓట్లు వచ్చాయంటే తక్కువేమీ కాదన్నది కోట్ల వారి అంతరంగం. అందుకే తెలుగుదేశం అభ్యర్థి రేణుకకు ఓట్లు వేసే ఖర్మ ఎందుకు పట్టిందని ఆయన మండిపడ్డారు. పాణ్యం సిమెంటు యాజమాన్యం తమ అతిథి గృహంలో రెండు రూమ్‌లు తెలుగుదేశానికి, మిగిలిన అయిదు రూములు కాంగ్రెస్ వారికి ఇచ్చింది. అయితే తెలుగుదేశం వారికి ఆ రెండు రూములు కూడా ఎందుకిచ్చారనో ఏమో కోట్ల వారు ఆగ్రహం వ్యక్తం చేస్తూ "పాణ్యం సిమెంటు యాజమాన్యం సంగతి తేలుస్తానని" భీష్మ ప్రతిజ్ఞ చేశారు. పాణ్యం ప్రజలకు కృతజ్ఞత మాటేమో గాని అక్కడ కోట్లకు వ్యతిరేకంగా ఓటు చేసిన వారు మాత్రం గుండెలు అరచేతిలో పెట్టుకొని ముఖం చాటేసుకొనే పరిస్థితి కల్పించారు. పాణ్యం నియోజక వర్గంలో కోట్ల వారి కృతజ్ఞతా పర్యటన ఆయన భవిష్యత్ ధోరణికి నాంది అవుతుందా? వేచి చూడాల్సిందే.

# శివారెడ్డి పద్యాలు

### కాంగిరేసు గెలుపు

కాంగిరేసుగెలుపు కాయమ్ము న్యాయమ్ము!
తిరుగులేదు కవిని తీర్పుయిస్తె
నిజము బయట బిడితె విస్ఫోరమొస్తుంది
దేని కులుకిన పోని తుంట!

మనలో మాట కాంగి మన రెండు
కనుకుంటె
తగిలి తగల కుంత తప్పుకుంటె
ఎక్కడుంది నీకు ఏముంది స్వాతంత్ర్యం
పిచ్చి నడత, ఇంది పెంచియున్న?

ఆశైన కొంత హద్దు పద్దుండాలి
ప్రాకులాడ బోకు ప్రతిదానికి
పరుగులెత్త తావు పరుతావు కాల్జారి
నవ్వుతారు చూచి నాగరికులు!

యిచ్చినిచ్చు కవివి ఏదేదో వ్రాస్తాను
గోకుతాను ప్రొద్దు బోక అంత
పరా, పాలిటిక్సు వదిలేసి మానేసి
ఎంతో కాలమైంది కొంత నిజము!

### లేగుంటపాడు

అచ్చ తెలుగుబిడ్డ ఆదర్శ గృహలక్ష్మి
అరపరాని భక్తి అదినుండి.
నిజము బయట బిడితె విస్ఫోరమొస్తుంది
పాలు, వెన్న, నెయ్యి ప్రతిది కల్తి!

ఆశ డబ్బులంటె అదినేను కాదన్ను
తప్పుగాదు దాన్ని తరచ రాదు,
గాడిద గుర్రమొకటి గాదు లేగనపాడు.
తెలుసుకోవె కళ్ళు తెరుచుకోవె!

## సణుగుడు

(4 పేజీ తరువ)

ఆయిందనడానికి వారి వార పత్రికల్ వస్తున్న కథల తీరు చూడండి!

"జానకి వంటరిగా మంచం మీద బోర్ల గిల పడుకొని నవల చదువుతూంది. రెండు కాళ్ళూ పైకెత్తడంతో చీర మోకాళ్ల వరకు తొలగి పోయి గంధం చెక్కలా నున్నగా తెల్లగా వున్న ఆమె కాలి పిక్కలు మెరిసి పోతున్నాయి. పైట ప్రక్కకు జరగడంతో ఆమె బలమైన వక్షోజాలు సగం వరకు కన్పిస్తూ కవ్విస్తున్నాయి. ఆమె రెండు చేతులూ పైకెత్తి వళ్లు విరుచు కుంటుండగా శంఖం లాంటి ఆమె మెడ, బలమైన రొమ్ములు, తెల్లని పొట్ట, లోతైన బొడ్డు బహిర్గతమై... (26.3.93)

ఈ మాదిరి వర్ణనలున్న కథ లేకుండా పత్రికే విడుదల కావడం లేదు. కథల్లో గుమ్మరించే బూతు చాలదని కాలోలు – సెక్స్ కోసం స్పెషల్ ఫీచర్ నడుపుతున్నారు. శాంపిల్‌కి అందులోని కార్టూన్ ఒకటి చదవండి.

ఒకరు: ఈ వేళ ఆవిడ ఎత్తిందిరా

మరొకరు: అప్పుడేం చేశావు?

అతను: నలుగురు చూసినపుడు బాగోదని బ్రతిమలాడి, ఆమె ఎత్తిన చెయ్యి దించాను.

* * *

అదేంటే... అలా లంగా ఎత్తేశావ్ – బ్రహ్మానందం

నాకు పర పురుషుల్ని చూస్తే సిగ్గండీ బాబూ – జయలలిత

సిగ్గని అలా ఎత్తేస్తె ఎలాగ – బ్రహ్మానందం

నాకు కనిపించదు కదండీ – జయలలిత

* * *

'విశ్వదర్శనం' చేయించే పత్రిక తన పాఠకుల చేత చదివించాల్సిన వ్రాత లేనా ఇవి?

పత్రికల మీద పెట్టుబడి పెరిగింది; పోటీ పెరిగి పోయింది; పాఠకుల అవసరాలు, అభిరుచులు వెంట వెంటనే మారి పోతున్నాయి; పత్రికలోని భావాలతో పాఠకుడు తన ఆలోచనా రీతులను సంస్కరించుకునే రోజులు గతించి, పాఠకుడు నచ్చే సంగతులు కనిపెట్టి పత్రికలు తమ విధానాలు మార్చుకునే దినాలు దాపురించాయి; వార్తలు, సంపాదకీయాలతో పాఠక దర్శనం చేసుకునే దిన పత్రికలూ, వాటి రెంటికి సెకండ్ ప్రిఫరెన్స్ ఇచ్చి వేడి వేడి వ్యాఖ్యలతో, ఉబుసుపోక కబుర్లతో, మత్తెక్కించే డైలీ సీరియల్స్‌తో, పురాణ కాలక్షేపాలతో, కుట్టు అల్లికల అట్రాక్షన్‌లతో, పంచరంగుల బొమ్మల అలంకారాలతో పాఠకుడికి సత్కాలక్షేపం కల్గించేందుకు యత్నిస్తున్నాయి. ఈ పోటీలో పాల్గొనలేని, ఈ పరుగు అందుకో లేని పత్రికలు సహజ మరణం చెందుతున్నాయి. ఆంధ్ర పత్రికకి గతి పట్టింది, ఆంధ్రప్రభ ఎంతటి దుస్థితిలో వున్నదీ, విశాలాంధ్ర, ప్రజాశక్తులు ఎట్లా తెరమరుగైంది చూస్తూనే వున్నాం కదా! పత్రికను నిలబెట్టుకోవడానికి, పది మంది చేత చదివించి తీయడానికి పాత విలువలు ప్రమాణాలకు ప్రక్కన బెట్టి కొత్త పుంతలు తొక్కడంలో తప్పు లేదు కాని, ఆ నెపంతో పచ్చి బూతును పాఠకుల మెదళ్లకు సరఫరా చేయ చూడడం నేరం కాదా? కేవలం వ్యాపారానికే పరిమితమైన 'స్వాతి' వంటి చెత్త పత్రికలు నాలుగు కాసులు కళ్ల జూడడం కోసం శృంగార కథలతో సర్క్యులేషన్ పెంచుకో గల్గింది నిజమే కావచ్చు; కాని ఆంధ్రజ్యోతి వంటి చరిత్ర కల్గిన పత్రికలూ ఆ తప్పు త్రోవనే నడవాలా? సర్క్యులేషన్ ఒక్కటే పరమావధా? సర్క్యులేషన్ పెంచు కోవడానికి ఇతర మార్గాలేవీ లేవా? యాజమాన్యం డబ్బు కక్కుర్తితో చేసే పాడు పనులకు గంగిరెద్దులా తల వూపడం పాత్రికేయుల వృత్తి ధర్మానికి సమ్మతమైన సంగతా? ఇంట్లో పిల్లలు చెడి పోతారని పైగ్గా పరుపు గదిలో దాచుకొని చదువుకునే స్థితికి పత్రికలు వస్తే, అది ఎవరికి పరువు? వృత్తికే కళంకం కాదా?

నండూరి రామ మోహన రావు గారి వంటి మేధావి, విజ్ఞాన ఖని, ఉపనిషత్తుల సారాన్ని మధించి సామాన్యులకు అరటి పండు వల్చినట్లు విప్పి చెప్పగల ప్రతిభా వంతుడు, విశ్వ రహస్యాలను తేలిక పదాలతో, సరళమైన భాషలో సగటు పాఠకుడికి బోధించ గల్గిన మేధో సంపన్నుడి నిర్వహణలోని పత్రికను ఆక్షేపించే స్థాయి, సామర్థ్యం నాకు ముమ్మాటికీ లేవు; కాని, పాత్రికేయ ప్రమాణాలకు ప్రమాణంగా చెప్పుకునే పత్రిక, వ్యాపారం పేరుతో అంతగా దిగజారి పోవడం చూసి బాధను ఓర్చుకోలేకనే ఈ సణుగుడు; సహృదయంతో అర్థం చేసుకుంటే ధన్యుడ్ని!

## కారుచౌక

( 4 పేజీ తరువ )

ద్వారా ప్రభుత్వానికి వస్తున్న రాబడి 178 కోట్ల రూపాయలు మాత్రమే. 1350 కోట్ల రూపాయల సారాయి వ్యాపారంలో అయితే ప్రభుత్వానికి సగానికి సగం అంటే సుమారు 700 కోట్ల రూపాయల దాకా మిగులుతోంది. సారాయి ద్వారా కోల్పోయిన 700 కోట్ల రూపాయలను ప్రభుత్వం ఐ.ఎమ్.ఎఫ్.ఎల్. ద్వారా రాబట్టాలని నిర్ణయించుకుంది. ఐ.ఎమ్.ఎఫ్.ఎల్. వ్యాపారం తయారీ దారుడి దగ్గర నుంచి హోల్‌సేల్ డీలర్, రీటైల్ వ్యాపారస్తుడి దాకా కొనసాగుతోంది. తయారీ దారుడి దగ్గర నుంచి హోల్ సేల్ డీలర్ కనీసం పదిశాతం కమీషన్ పుచ్చుకుంటున్నారు. హోల్ సేల్ డీలర్ నుంచి చిన్న చిన్న డీలర్లు మరో 10 శాతం కమీషన్ పొందుతున్నారు. ప్రభుత్వం ఇప్పుడు హోల్ సేల్ డీలర్, చిన్న డీలర్ వ్యవస్థల్ని రద్దు చేసి ఈ రెండు పనుల్ని తనే స్వయంగా చేస్తుందట. దానివల్ల 3,872 కోట్లలో 20 శాతం దాకా అదనంగా ప్రభుత్వానికి డబ్బు మిగుల్తుంది. అది కాకుండా చౌక ధరకు తయారు చేసే విస్కీ, బ్రాందీల వల్ల మరో నూటా యాభై కోట్ల రూపాయల ఆదాయం వస్తుంది. కాకుల్ని కొట్టి గద్దలకు వేసినట్లు సారాయి నేరు కొట్టి బ్రాందీ విస్కీలకు పోస్తోంది ప్రభుత్వం. సారాయి ద్వారా కోల్పోయిన ఆదాయాన్ని విదేశీ ముసుగులో కాస్తంత రంగు కలిపి రాబట్టు కోవాలనుకుంటున్న ప్రభుత్వ చిత్తశుద్ధికి జోహార్లు – సారాయి వ్యతిరేకత ఉద్యమ కారులారా- దీనికి మీరేమంటారు?

## జనవాణి

(3 పేజీ తరువ)

కళావాచస్పతి శ్రీ కొంగర జగ్గయ్య వెలిబుచ్చిన అభిప్రాయాలు సముచితంగా వున్నాయి. కుటుంబ సమేతంగా చూడలేని చిత్రాలకు ప్రభుత్వం కోట్ల రూపాయల రాయితీ లివ్వడం శోచనీయం. సినిమాల కిచ్చే రాయితీల్లో 30 వ వంతు నాటక రంగానికి కేటాయిస్తె అద్భుతమైన కళాఖండాలతో పాటు ఎంతో మంది కళాకారుల పొట్టలు నిండుతాయన్నది వాస్తవం.

ఇటీవల జంట నగరాల్లో ప్రతి శని, ఆదివారాల్లో 'రసరంజని' అనే సంస్థ ద్వారా జె.వి. సోమయాజుల సోదరులు, మరికొంత మంది నాటక రంగ పుద్దీపన కోసం టిక్కెట్ నాటకాలు వేసి ఆకర్షింప చేస్తుండడం ముదావహం. ఇక్కడ సినిమాను మించిన కళాత్మకతను నాటక కళాకారులు ప్రదర్శిస్తున్నారన్నది వాస్తవం. ఇకనైనా నాటక రంగానికి ముఖ్యమంత్రి కొన్ని రాయితీలిచ్చి దాన్ని బ్రతికిస్తారని ఆకాంక్ష.

నెల్లూరు – పొన్నాల రామసుబ్బారెడ్డి

### రాజమండ్రిని చూసి నేర్చుకోండి!

నెల్లూరు పట్టణం, అభివృద్ధి విషయంలో రోజు రోజుకీ పెరిగి పోతున్నా అపరిశుభ్రత విషయంలో మాత్రం మునిసిపాలిటీ పుణ్యాన ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్లుంది. అభివృద్ధి చెందిన ప్రాంతాలైన సంతపేట, కపాడిపాళెం, చిన్నబజారుల్లో మురుగు కాల్వలు, చెత్త కుప్పలను చూసి ఆశ్చర్యపోయాను. ఈ స్థితికి కొంత వరకు ప్రజలు కారణమైనా తప్పకుండా మునిసిపాలిటీ కూడా బాధ్యత వహించాలి.

శుభ్రత, పరిశుభ్రత విషయంలో రాజమండ్రి మునిసిపాలిటీ కొన్ని కొత్త పోకడలను ప్రవేశ పెట్టింది. జోన్ అంతా పరిశుభ్రత విషయంలో వివాదాలు వ్రాసింది. ప్రజలకు బాధ్యతలు తెలియచెప్పింది. దాన్ని పాటించేలా చేయడంలోనూ కృతకృత్యులయ్యారు. మన మునిసిపాలిటీ కూడా అటువంటి ప్రయత్నం చేస్తె బాగుంటుందని నెల్లూరీయుడుగా నా ఆశ.

రాజమండ్రి – రావూరి సురేంద్రనాథ్

### మార్కెట్‌లో మోసం

చిన్నబజారు కూరగాయల మార్కెట్ తూకాలలో మోసం మూడు పువ్వులు, ఆరు కాయల్గా సాగుతుంది. దీన్ని అరికట్టే నాధుడే లేడు. మార్కెట్‌లో అపరిశుభ్రత తాండవిస్తున్నది. వుదయం పూట ఒకసారి మునిసిపల్ స్పెషల్ ఆఫీసరైన కలెక్టర్ వచ్చి పరిశీలిస్తే పరిస్థితులు తెలియడంతో పాటు గొప్ప, గొప్ప మార్పు వస్తుందని భావిస్తున్నాను.

నెల్లూరు – సి. రాజేష్

## పంచాంగము

### ముహూర్తములు

25 తేది ఆదివారము ఉదయము 4.0 గంటలకు మీనలగ్నమున గృహప్రవేశ వివాహములకు

26 తేది సోమవారం ఉదయం గం. 10.00 లకు మిధునలగ్నమున ఉపనయన శంకుస్థాపన వ్యాపారా రంభములకు

28 తేది బుధవారము ఉదయం గంట. 9.56 లకు మిధున లగ్నమున వివాహ వ్యాపారారంభములకు సుమూర్తములు కలవు

### ఏప్రెల్ తిథులు

చైత్ర బహుళ

| | | | |
|---|---|---|---|
| తే 24శని | విదియ | ఉ.గ. | 7.00 వ |
| తే 25ఆది | తదియ | ఉ.గ. | 7.10 వ |
| తే 26సోమ | చతుర్థి | ఉ.గ. | 7.21 వ |
| తే 27మంగళ | పంచమి | ఉ.గ. | 6.10 వ |

తరువాత పూర్తిగా షష్ఠి

| | | | |
|---|---|---|---|
| తే 28బుధ | సప్తమి | రా.గ. | 3.30 వ |
| తే 29గురు | అష్టమి | రా.గ. | 1.40 వ |
| తే 30శుక్ర | నవమి | రా.గ. | 11.25 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
యం.ఎ

## సిల్క్ ఖైదు – కోర్టు ధిక్కార అభియోగం

సిల్క్ స్మిత చాలా కాలం క్రితం "ప్రేమించి చూడు" అనే చిత్రాన్ని ఇద్దరితోకలసి నిర్మించింది. అందులో ఆమె హీరోయిన్. అది తమిళంలో "కాదలిత్తు పార్" గా డబ్ చేయబడింది. తెలుగు చిత్ర నిర్మాణంలో తీసుకున్న అప్పును చెల్లించనందున విశ్వాని అనే సంస్థ కోర్టులో దావా వేసింది. తీర్పులో హై కోర్టు న్యాయమూర్తి శ్రీ ఎన్. అర్ముగం "తెలుగు చిత్రం గాని, తత్సంబంధిత వీడియో కేసెట్ గాని విక్రయించకూడదు" అని ఆదేశించారు. కాని, కోర్టు తీర్పును ఉల్లంఘిస్తూ వీడియో కేసెట్‌ను వెలువరించి నందుకు స్మితతో పాటు మరో ఐదు గురి పై విశ్వాని సంస్థ మరో కేసు వేసింది. సమన్లు పంపినా స్మిత హై కోర్టుకు హాజరు కానందున ఆమెను ఖైదు చేసి హాజరు పరచ వలసిందిగా వారెంట్ జారీ చేయబడింది. అలాగే ఏప్రెల్ 8న ఆమెను హై కోర్టు న్యాయమూర్తి శ్రీ ఎన్. అర్ముగం ఎదుట పోలీసులు హాజరు పరిచారు. ఆమె తరఫు వకీలు "కోర్టు సమన్లు పంపినపుడు ఆమె హైదరాబాద్‌లో షూటింగ్‌లో ఉన్నందున హాజరు కాలేక పోయిందని" చెప్పారు. ఇక పైన ఈ కేసు విషయంలో ఆమె తరఫున తాను హాజరు కాగలనని కూడా ఆ వకీలు విజ్ఞప్తి చేశారు. అందుకు న్యాయమూర్తి సమ్మతిస్తూ, ఎప్పుడైనా అవసరం వస్తే ఆమె హాజరు కావలసి ఉంటుందని సూచించారు.

## సినిమాలలో రాజకీయాలా?

తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి డి.ఎం.కె. నాయకుడు శ్రీ ఎం. కరుణానిధి చక్కని వక్త గాక సుప్రసిద్ధ తమిళ రచయిత కూడా. ఇప్పటికీ ఆయన రచనలు, కవితలు కొన్ని తమిళ పత్రికల్లో ప్రచురిత మౌతుంటాయి. ఈయన కథ, మాటలు వ్రాసి సమర్పించిన "మధుర మీనాక్షి" రాజకీయ వ్యంగ్య చిత్రంలో అప్పటి తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత పై కొన్ని విసుర్లు ఉన్నాయంటూ ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. సభ్యుడైన ఒక లాయరు ఆ చిత్రాన్ని నిషేధించాలని మద్రాసు జుడిషియల్ కోర్టులో కేసు దాఖలు చేశారు. "అందులో ముఖ్యమంత్రిని న్యూనత పరిచే సన్నివేశాలేవీ లేవు. పైగా ఒకసారి సెన్సార్ అయిన చిత్రాన్ని నిషేధించే ప్రసక్తి లేదు" అని న్యాయమూర్తి తీర్పు ఇచ్చారు. ఐతే, ఆ చిత్రం విజయవంతం కానందుకు ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. వారు ఎంతో ఆనందించారు!

## మమ్ముట్టి – రైల్వే కూలీ

మమ్ముట్టి ప్రతిభ గల నటుడే. కాని, "రైల్వే కూలీ" చిత్రంలో, హీరో పాత్రను ధరించడానికి ఆయన తప్ప తగిన తెలుగు నటులెవరూ కోడి రామకృష్ణకు తోచలేదేమో! మమ్ముట్టి సరసన మీనా, హరీష్ సరసన రోజాతో పాటు శ్రీ విద్య, వై. విజయ, చీరం మస్తాన్ రావు, కాస్ట్యూమ్స్ కృష్ణ నటిస్తున్న కుసుమాంజలి ఆర్ట్ క్రియేషన్స్ "రైల్వే కూలీ" మూడో షెడ్యూల్ ఏప్రెల్ చివాఖరు నుంచి ఇరవై రోజుల పాటు విశాఖ పట్నంలో జరుగుతుందని నిర్మాతలు కె.వి. లక్ష్మి, ఎన్. పార్వతి దేవి తెలియజేశారు. మాటలు: ఎం.జి. రామారావు, పాటలు: వెన్నెలకంటి, జొన్నవిత్తుల, సంగీతం: రాజశేఖర్.

* సిల్క్ స్మితకు కోర్టు వారెంట్!
* కరుణానిధి చిత్రం పై కేసు
* తెలుగులో మమ్ముట్టి
* చక్కని చిత్రాలకే రాయితీలు
* మురళీ మోహన్ వారసుడు

## "వారసుడు"

మురళీమోహన్ సమర్పించే శ్రీ జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ 19 వ చిత్రానికి "వారసుడు" అని పేరు పెట్టినట్లు డైరెక్టర్ ఇ.వి.వి. సత్యనారాయణ తెల్పారు. ఈ చిత్రంలో కృష్ణ, నాగార్జున, నగ్మా పాల్గొంటున్నారు. సంగీతం: కీరవాణి. నిర్మాత: డి. కిశోర్.

## చక్కని చిత్రాలకే రాయితీలు

పద్మాలయ వారి "అన్నా–చెల్లెలు" చిత్రం ప్రారంభోత్సవంలో ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి "హింస, అశ్లీలతలను దట్టించి ప్రభుత్వమే ప్రోత్సహిస్తున్నట్లు నిపిస్తుంది కొన్ని సినిమాలు చూస్తుంటే. అలాంటివి తగ్గించి, సంఘానికి, రాష్ట్రానికి, మన దేశాభివృద్ధికి తోడ్పడే చిత్రాలకే ఇక పైన రాయితీలు కొనసాగుతాయి. అలాంటి చిత్రాలను సిఫారస్ చేయడానికి రాష్ట్ర స్థాయిలో ఒక స్క్రీనింగ్ కమిటీని ఏర్పాటు చేయడం జరుగుతుంది" అని ప్రకటించారు. ఈ ప్రకటన ఎంతో హర్షణీయమైంది. చక్కని చిత్రాలు రూపొందడానికి దోహదం చేస్తుంది. ఐతే, రక్తపాతం, అశ్లీలతలు లేకుండా సినిమాలు ఎలా తీయడం అనేదే దర్శక నిర్మాతల బాధ.

## నమోదు చేయబడిన కొత్త చిత్రాల పేర్లు

ధనలక్ష్మి ఫిలిమ్స్ "హంస", మార్షల్ ఆర్ట్ క్రియేషన్స్ "కరాటె ఫైటర్స్", శ్రీ అనుపమ ప్రొడక్షన్స్ "పగ సాధిస్తా", రవి ఆర్ట్స్ "నేటి రాజకీయం" శ్రీ లక్ష్మీదేవి ఫిలి ప్రొడక్షన్స్ "ప్రత్యర్థులు", ఓం సాయి ఫిలిమ్స్ "దొంగఅల్లుడు" శ్రీ బాలాజీ సినీ ఎంటర్‌ప్రైజస్ "మొండి మనిషి",

ధనలక్ష్మి ఫిలిమ్స్ "అరాచకం", కె.ఎస్. ప్రొడక్షన్స్ "చిన్న", గోపి ఆర్ట్ ప్రొడక్షన్స్ "చిన్నల్లుడు", సుచిత్ర క్రియేషన్స్ "దేశం కోసం", శ్రీ రత్నశేఖర్ ప్రొడక్షన్స్ "పోలీస్ దర్బార్", రాశి మూవీ క్రియేషన్స్ "నాయుడు గారబ్బాయి", బాబా కంబైన్స్ "స్వాతికి పెళ్లంట", శ్రీ జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ "ఒడుకు

నెత్తురు" విజయ ఎముండేశ్వరి ఫిలిమ్స్ "ఆలీబాబా – అరడజన్ దొంగలు", శ్రీ లక్ష్మీదేవి ఫిలిమ్ ప్రొడక్షన్స్ "దొంగ పాండవులు", శ్రీ గురురాఘవేంద్ర ఫిలిమ్స్ "ముద్దబ్బాయికి ఇద్దరు పెళ్లాలు", జీవన్ కిశోర్ ఫిలిమ్స్ "రాజధానిలో రంభ", సూపర్ హిట్

ఫిలిమ్స్ "ఎస్.పి. కొడుకు", ప్రసన్నకుమార్ ఎంటర్ ప్రైజస్ "సిటీలో ఖైదీ", సెవన్ స్టార్ ఫిలిమ్స్ "మరో ప్రేమాభిషేకం", ఎస్.వి.ఆర్. ప్రొడక్షన్స్ "చిన్న జమీందారు", విజయా ఆదిత్యా క్రియేషన్స్ "రౌడీ రాణి – వయ్యారి రాణి".

★

# పాత కథ పాత దృశ్యాలు పాత పాత్రలు పాత హాస్యంతో పాత కంపు కొడుతున్న రెండిళ్లపూజారి

చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

చిత్రం చివరన హీరో గోపి కృష్ణ (సుమన్) తన మిత్రుడైన శంభులింగం (మల్లికార్జున రావు) చేత "రెండిళ్లపూజారి" చిత్రం తాలూకు కథ చెప్పిస్తాడు. ఇలా చెప్పించటం చర్విత చర్వణమే అయినా చెప్పిన తర్వాత వినక తప్పదు కదా!. ఆ కథా కమామిషు యిలా వుంది.

గోపీకృష్ణ (సుమన్) ఆయన భార్య రాధ(శోభన)లది అన్యోన్య దాంపత్యం. ఎప్పుడూ ఒకరికొకరు దూరంగా వుండింది లేదు. ఉన్నట్టుండి రాధ తండ్రికి గుండెపోటు రావటంతో తండ్రిని చూచేందుకు పుట్టింటికి పోతుంది. తాత్కాలికంగా యిద్దరి మధ్య ఎడబాటు ఏర్పడుతుంది.

రాధ తండ్రి గుండె ఆపరేషనుకు అర్జంటుగా లక్ష రూపాయలు కావలసి వస్తుంది. రాధ, గోపీకృష్ణకు ఫోను చేస్తుంది. గోపీకృష్ణ తన వద్ద వున్న ఆఫీసు డబ్బులో లక్ష రూపాయలు పంపుతాడు. మిగతా నాలుగు లక్షలు రంగూబాయ్ అనే నపుంసకుడు(కోట శ్రీనివాస రావు) నడుపుతున్న రౌడీ ముఠా దొంగలిస్తుంది. దానితో గోపీ కృష్ణకు ఉద్యోగం పూడి జైలుకు వెళ్లే పరిస్థితి ఏర్పడుతుంది.

ఇది యిలా వుండగా మాధవి (నగ్మా) అనే శ్రీమంతుల అమ్మాయికి ఒక నెల రోజుల పాటు భర్తగా నటించే యువకుడు కావలసి వస్తుంది. అందుకు పారితోషికం పది లక్షలు ప్రకటిస్తుంది. గోపీకృష్ణను కోరగా మొదట్లో సందేహిస్తాడు. ఆ తర్వాత డబ్బు అవసరాన్ని బట్టి అంగీకరిస్తాడు. కిరాయి భర్తగా నటించటమే కాదు మాధవి బామ్మ (నిర్మలమ్మ) పన్నాగంతో గోపీకృష్ణ మాధవికి అసలు భర్త అవుతాడు. దానితో గోపీకృష్ణకు ఇద్దరు భార్యలవుతారు. ఒకర్ని తెలియకుండా ఒకరికి పెళ్లి చేసుకున్న రహస్యం బయట పడి పోతుంది. అవల యిద్దరి మధ్య గందరగోళం ప్రారంభమవుతుంది.

విలన్ రంగూబాయి రాధకు విషమిచ్చి చంపాలనుకుంటుంది. కాని అది విషమని తెలియక గోపీకృష్ణ త్రాగుతాడు. రంగూబాయి మాధవిని, రాధను, కిడ్నాప్ చేసేందుకు ప్రయత్నిస్తుంది. గోపీకృష్ణ విషం త్రాగటం వల్ల తూలుతూ పడుతూ రంగూబాయిని ఇతర రౌడీలను చావబాది తన యిద్దరు భార్యలను రక్షించుకుంటాడు. ఇద్దరు భార్యలూ గర్భం ధరించినట్టు తెలియపరచి కథను ముగిస్తారు.

జి.వి. అమరేశ్వర రావు వ్రాసిన ఇద్దరు భార్యల కథలో కొత్తదనమేదీ లేదు. ఇద్దరు భార్యలతో ఒక భర్త కులకటం కథా వస్తువుగా చాలా సినిమాలొచ్చాయి. అసలు ఇద్దరు భార్యలను పొందటమనేది చట్టరీత్యా నేరం అయినా నిర్మాతలు, దర్శకులు చట్టాన్ని నిర్లక్ష్యం చేసి చిత్రాలను తీస్తున్నారు.

చిత్రం చివరి వరకు చాలా చప్పగా సాగుతుంది. చివరి భాగంలో కాస్త పట్టును పుంజుకుంటుంది. ఒక భర్త, ఇద్దరు భార్యల మధ్య తంటాలు పడే దృశ్యాలు ఇది వరకు చాలా సినిమాల్లో చూడటం వల్ల ఈ చిత్రంలో అవి బోరు కొడతాయి. కథానాయకుడు ఇద్దరి భార్యలతో వేరు వేరుగా పాటలు పాడుతూ చిందులెయ్యటం సర్వసాధారణం కావటంతో ఇదీ ఆసక్తికరంగా లేదు. గోపీకృష్ణ పాత్ర అంతగా ఎదగలేదు. ఈ పాత్రలో సుమన్‌కునటించే అవకాశమే చిక్కలేదు. రాధ, మాధవి పాత్రలు కూడాఅంతంత మాత్రంగానే అఘోరించాయి. కాస్త కొత్తగా ఆసక్తికరంగా కనిపించేది రంగూబాయి పాత్ర. ఇది కొజ్జా పాత్ర. ఈ పాత్ర విలన్ రూపం దాలుస్తుంది. రౌడీ ముఠాను నడుపుతుంది. పిల్లలను సప్లయి చేస్తుంది. అందమైన ఆడపిల్లల్ని విదేశాలకు ఎగుమతి చేస్తుంది. మగా, ఆడా కాని ఈ కొజ్జా పాత్రను బహు రంజుగా పోషించారు కోట శ్రీనివాస రావు. తర్వాత శంభులింగంగా మల్లికార్జున రావు చక్కగా నటించారు. బాబూమోహన్ హాస్యం ఫరవాలేదు. నిర్మల గొప్పగా నటించింది.

ప్రకాష్ కెమరా చిత్రానికి కొంత ప్రాణం పోసింది. కీరవాణి సంగీతం కమ్మగా వుంది. పాత కథ, పాత దృశ్యాలు, పాత హాస్యం, పాత పాత్రలతో పూర్తిగా పాత కంపు కొట్టించారు కొత్త దర్శకుడు బి. ప్రభాకర్.



రథసారథి చిత్రంలో వినోద్ కుమార్, సూర్యకాంతం, రవీనా టాండన్, వై. విజయ

# ట్రాఫిక్ మార్పులకు డ్రైనేజి కాలువల బ్రేక్!

టౌనలో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టిన వన్‌వే ట్రాఫిక్ పథకానికి ఆదిలోనే అడ్డంకులు తగిలాయి. ట్రాఫిక్ నంతా ట్రంకురోడ్డు మీద మళ్లించడం వల్ల సిమా సెంటర్ వద్ద నున్న అండర్ గ్రౌండ్ డ్రైనేజి కాలువ పై కప్పు కుప్పకూలి పోవడంతో మళ్లీ ట్రాఫిక్ రూటు మారింది. ఆత్మకూరు బస్టాండు నుండి కనకమహల్ మీదుగా వచ్చే వాహనాలను బృందావనం మీదుగా మళ్లిస్తున్నారు. దీనివల్ల కనకమహల్, గాంధీబొమ్మ, వి.ఆర్.సి. సెంటర్ల నుండి టౌనలోని పలు ప్రాంతాలకు ప్రతినిత్యం టౌన్ బస్సులు ఎక్కి వెళ్లే ప్రజలు నానా కష్టాలు పడుతున్నారు. ప్రస్తుతం సిమా సెంటర్ వద్ద కుప్పకూలిన డ్రైనేజికి యుద్ధ ప్రాతిపదికన తాత్కాలిక మరమ్మత్తులు చేస్తున్నా సైకిల్ కూడా అటు పోలేని పరిస్థితి వుంది. ఈ రిపేరు పూర్తయ్యాక ఎన్నాళ్లు మళ్లీ ఆ డ్రైనేజి ఈ ట్రాఫిక్ వత్తిడిని భరిస్తుందో చెప్పడం కష్టం. ఈ సమస్యను అధిగమించినా మరో నెల, రెండు నెలల్లోగా ఏసి సెంటర్ వద్ద నున్న ఆయ్యాల కాలువ పై కప్పు ఇదే విధంగా కూలక తప్పదు. ఇప్పటికే కూలి వున్న కప్పుకు సమాధి కట్టారే తప్ప. నెలరోజుల్లోగా మరమ్మత్తులు చేస్తామన్న అధికారులు దాన్ని పట్టించుకొన్న పాపాన పోలేదు. ఏది ఏమైనా ట్రాఫిక్ మళ్లింపు సమయంలో రోడ్ల క్రింద వుండే డ్రైనేజి కప్పుల సామర్థ్యం పరీక్షించకనే ఎడతెరిపిలేని ట్రాఫిక్‌ను అనుమతించడం పెద్ద తప్పని చెప్పక తప్పదు.

## నెల్లూరు సంగతులు

### కవి బ్రహ్మ సృష్టి విమర్శింప శక్యమా!

వర్యాన శేఖరునిగా లబ్ధ ప్రతిష్ఠులైన శ్రీ తిక్కవరపు రామిరెడ్డి 101 జయంతి సభ 17 తేది రేబాల పట్టాభిరామిరెడ్డి భజన మందిరంలో ఘనంగా జరిగింది. బహు గ్రంథకర్త శ్రీ దుగ్గొట్టి వెంకట రమణయ్య అధ్యక్షతించిన సభను 'సాహిత్య సదస్సు' సంస్థ నిర్వహించింది. ప్రధాన వక్త జవహర్ భారతి కళాశాల రీడర్ డాక్టర్ జె.వి. సుబ్బరాయుడు తిక్కన భారత 'శాంతి త్రయాన్ని' తన తేట తీయని సమాస పలుకుల్లో తెనిగించారు. బ్రహ్మ సృష్టినైనా వివరించ వచ్చునేమో గాని కవి బ్రహ్మ సృష్టిని మాత్రం విమర్శించ సాధ్యం కాదన్నారు. తిక్కన వ్రాసిన స్త్రీ పర్వంలోని యుద్ధ బీభత్స దృశ్యం హృదయాలను కలచి వేస్తుంది. కుంతి ద్వారా కర్ణుని జన్మ రహస్యం విని ధర్మరాజు మనసు పడిన వేదనను వర్ణించిన తీరు అనన్య సామాన్యం. ధర్మరాజును ప్రశాంత చిత్తుడను చేయను శ్రీ కృష్ణుడు, అంపశయ్య పైని భీష్మాచార్యులు ప్రయత్నాలను చక్కగా చెప్పారు. అనంతరం సాహితీ వేత్త డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి చేతుల మీదుగా డాక్టర్ సుబ్బారాయుడును సన్మానింప జేసి రామిరెడ్డి అవార్డును బహూకరించారు. సభ ప్రారంభానికి ముందు తమ మధుర గానాలాపనతో శ్రోతలను సమ్మోహ పరచిన శ్రీమతి రాళ్లపల్లి సుబ్బులక్ష్మి కుమారి గాయత్రిలను గూడ సన్మానించారు. తొలుత మాజీ రోటరీ గవర్నర్ డాక్టర్ జె.వి. రెడ్డి స్వాగతం, చివరన మరో రొటేరియన్ కొండా బలరామిరెడ్డి వందనాలు చెప్పారు.

### నాయుడమ్మ స్మారక పథకం

ప్రఖ్యాత శాస్త్రవేత్త ప్రొఫెసర్ నాయుడమ్మ స్మారకంగా ప్రత్యామ్నాయ అభివృద్ధి వనరుల సంస్థ స్థాపన మహోత్సవం 24 తేది జరుగుతుంది. దీనిని ఆంధ్రప్రదేశ్ ఓన్నరీస్ సంస్థ ఎం.డి. శ్రీ వై. రతీష్ ప్రారంభిస్తారు. బెంగుళూరు ఇస్రో శాటిలైట్ సెంటర్ శాస్త్రవేత్త డాక్టర్ కస్తూరి రంగరాజన్, ఎలక్ట్రికల్ చీఫ్ ఇంజనీర్ శ్రీ ఎస్. గురుమూర్తి రెడ్డి ముఖ్య అతిథులుగా పాల్గొని ప్రసంగిస్తారు. నెల్లూరు యువ శాస్త్రవేత్త డాక్టర్ ఎ. జగదీష్ హోటల్ శివంలో ఈ కార్యక్రమం ఏర్పాటు చేశారు.

### బ్యాంకు వుద్యోగికి జైలు శిక్ష

స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ వుద్యోగి కె.వి. పూర్ణచంద్ర శర్మ పై మోపిన 8 చీటింగ్ కేసులు రుజువు కావడంతో అతనికి ఒక్కొక కేసులో ఏడాది లెక్కన జైలు శిక్ష విధిస్తూ రెండో అదనపు మెజిస్ట్రేట్ ఎం.డి. ఇంతియాజ్ అహమ్మద్ గురువారం తీర్పుచెప్పారు. బ్యాంకులో బంగారు నగల రుణాల పంపిణీ, వసూలు బాధ్యతలు చూడ వలసిన శర్మ తన బాధ్యతను మరచి పోయి బ్యాంకునే మోసం చేసాడు. బ్యాంకులో వున్న లక్షా ఇరవై ఐదు వేల రూపాయల విలువ జేసే 24 సవర్ల బంగారు నగలు కాజేసి, వాటి స్థానంలో రోల్డ్‌గోల్డ్ నగలు వుంచారు. అదీ గాక 1983 అక్టోబర్ 31 తేది బ్యాంకు లాకర్‌లో వున్న కొంత పైకాన్ని కూడా తీసుకొని పరారయ్యారు. అప్పటి బ్యాంక్ మేనేజర్ ఫిర్యాదు, నగలు కుదువ పెట్టిన వారిని విచారించి క్రైమ్ పోలీసులు అతని పై 8 చీటింగ్ కేసులు పెట్టారు. శర్మ చేసిన తప్పును ప్రథమ తప్పిదంగా భావించమని అభ్యర్థన చేసిన అతని న్యాయవాది వాదనను న్యాయమూర్తి త్రోసి పుచ్చుతూ వుద్యోగులే ఇలా చేస్తే ఎలా అని ప్రశ్నిస్తూ కఠిన శిక్ష విధించారు.

నెల్లూరు జిల్లా వర్కింగ్ జర్నలిస్ట్‌ల సభలో రాష్ట్ర అధ్యక్షుడు శ్రీనివాసులు రెడ్డి చేతుల మీదుగా ఉత్తమ జర్నలిస్ట్ అవార్డు అందుకుంటున్న 'జమీన్‌రైతు' రహీం; ప్రక్కన ఎమ్మెల్యే జె.కె. రెడ్డి, ఈనాడు శ్రీరాం.

### 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

ఇక జాషువా శర్మల తారతమ్యం. శర్మ గారు మంచి బడిపంతులు, ఒకపాటి భాషా పండితుడు కావచ్చును గాని జాషువా వంటి సహజ మధుర కవి ఎన్నటికి కాజాలడు. వారు, వారి శిష్యులు అభినవ తిక్కన అనుకోవడం – అనడం ఇతరులకు నవ్వులాటగా వున్నది మన మండలంలోనే! వీరికి తిక్కన 'క్వాలిటీ' గాని 'క్వాంటిటీ' గాని లేదు. అభినవ సుమతి శతకము అభినయమే. వీరి అధికారంతంతో గూడ ఇది అజ్ఞాత వాసం పోయింది ఇక లక్ష్మీ శృంగార కుసుమమంజరి ఎట్లున్నా తిక్కనత్వాన్ని ఆపాదించ జాలదు. శాస్త్రి గారే యీ బిరుదం యిచ్చినారంటే శాస్త్రి వర్మప్రియుడు కాబట్టి ఎగతాళి పరంగా వుంటుందేమో! ఒక వేళ నిజాన్నైనా – అది శాస్త్రి గారి Personal Opinion అవుతుంది. ఇతరులు దీన్ని ఒప్పుకొంటే తిక్కన పవిత్ర స్మృతికి అపచారము.

వెంకట రాయశాస్త్రి గారి వైజ్ఞానిక వైశాల్యము గాని, నిమ్నత గాని శర్మ గారికి లేదు. తిక్కన కవితా శిల్పము అంతకు ముందే లేదు. వీరి కున్న విలువ సరుకుకు మాత్రం నా మ్రొక్కులు. ఇది గుర్తించేగా బోలురెడ్డి గారు మనవూరి విద్యార్థికుడుగా శర్మ గారిని సన్మానించి వుంటారు. అటు తర్వాత జాషువాను సత్కరించింది వేరే సందర్భంలో. రెంటినీ జత చేయడం శర్మగారికి గౌరవ ప్రదం కాజాలదు. మిగిలిన విషయం - 1116 లకు అర్హత? ఇది జాషువా కవితను రుచి చూచిన ఆంధ్రలోకానికి కాందిశీకుడు వినిన – జడివిన రసజ్ఞులకు అల్పమని తోపక మానదు.

– పాఠకుడు

### ఏ.సి. స్టేడియం

(4 పేజీ కొరవ)

రూపాయలు ఒక్కొక్కరికి చెల్లించి 4 గురు హెల్పర్లను పెట్టుకున్నారు. అద్దె డబ్బులతోనే స్టేడియం ఎలక్ట్రిఫికేషన్, టాయిలెట్ గదుల నిర్మాణం పూర్తి చేశారు. సైకిల్ స్టాండ్‌తో పాటు ఆట స్థలంలోని గుంటల మిట్టలు పూడ్చను నెల నెల వచ్చే అద్దెను వినియోగిస్తా మంటున్నారు. స్టేడియం అభివృద్ధికి మునిసిపాలిటీ దమ్మిడీ అంత సహాయం కూడా చేయడం లేదని ఆరోపణ. హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ అక్కడి స్టేడియం అభివృద్ధికి 40 లక్షలు, విజయవాడ కార్పొరేషన్ కోటి 20 లక్షలు ఖర్చు పెట్టాయట. ప్రస్తుత కలెక్టర్ వత్తిడి మేరకు నీటి సరఫరా పైపులు మాత్రం వేసి చేతులు దులుపుకొన్నారట. అందరూ స్టేడియం అభివృద్ధికి సహాయ నిరాకరణ చేస్తుంటే రాష్ట్ర క్రీడా సంస్థ కూడా అదే మార్గాన సాగుతుంది. స్టేడియంకు వచ్చే క్రీడాకారులకు సరిపోయేన్ని వస్తువులు అందుబాటులో వుంచడం లేదు. వచ్చే కొన్ని ఆట వస్తువులను పూర్తి సామర్థ్యమున్న క్రీడాకారుల తప్ప ఇతరులకు కోచ్‌లు అందివ్వడం లేదు.

గత సంవత్సరం తమ పని తీరుపై విమర్శల పాలైన కోచ్‌లు అన్ని రాష్ట్ర పోటీలకు ఈ సంవత్సరం జిల్లా నుండి జట్లను తీసుకెళ్లారు. వీటిలో బాస్కెట్ బాల్‌లో బాలికల జట్టు 4 పార్లు గెలిచి బ్రహ్మాండమైన ప్రతిభ చూపింది. వాలీబాల్ జట్టులోని ఇద్దరు జిల్లా బాలికలు జాతీయ జట్టుకు ఎంపికయ్యారట. హ్యాండ్ బాల్‌లో బాలికల జట్టు రాష్ట్ర స్థాయిలో మూడవ స్థానంలో నిలిచింది. అథ్లెటిక్స్‌లో కూడా ఫరవాలేదని పించారు. ప్రోత్సాహంగా వుంటుందని ఈ సంవత్సరం రిపబ్లిక్ డే పెరేడ్‌లో కూడా ఈ క్రీడాకారులందరికీ ప్రశంసా పత్రాలు ఇప్పించారు.

నెల్లూరులో ఒక స్టేడియం వుండాలని 1969లో కెన్యా దేశపు హాకీ జట్టును నెల్లూరుకు పిలిపించి అప్పటి కలెక్టర్ శ్రీ ఎస్. ఆర్. శంకరన్ పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో ఎగ్జిబిషన్ మ్యాచ్ నిర్వహింప జేసి నిధులు కూర్చి ఒక మంచి పనికి శ్రీకారం చుట్టారు. స్టేడియం స్థలం దురాక్రమణ కాకుండా ఆ కాలంలో ఫుట్‌బాల్ శిక్షకునిగా వచ్చిన శ్రీ అజీముల్లాఖాన్ విస్తృతంగా శ్రమించారు. శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి కలెక్టర్ కె. రాజా అభివృద్ధికి చేయూత నందిస్తే మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్థన రెడ్డి స్టేడియం రాష్ట్రంలోని స్టేడియం లన్నింటిలో ముందు నిలపాలని లక్షలాది రూపాయల నిధులు మంజూరు చేయించారు. వీరందరి శ్రమ వృథా కాకూడదు. ఇప్పుడు విడుదలై వున్న నిధులలో అధికారులు 1995 కల్లా పూర్తి చేస్తామని చెప్పిన ఇండోర్ స్టేడియం నిర్మాణం పూర్తి చేసి మాట నిలబెట్టుకోవాలి. అంతర్జాతీయ మ్యాచ్‌లను నెల్లూరు ఏసి సుబ్బారెడ్డి స్టేడియంలో కూర్చుని నెల్లూరు ప్రజలు చూసేలా చేయాలి. అది ప్రజల చిరకాల వాంఛ!

# నూతన భావనలు, తెలియని ఆవేదనలతో పాఠకుడ్ని ఆలోచింపజేసే వర్తమానం

వర్తమాన యుగంలో, ప్రవర్తమాన కవులలో ఎండ్లూరి సుధాకర్ రచించిన వచన కవితా సంపుటి 'వర్తమానం'. ఇందు 37 వచన కవితలున్నాయి. నేడు సాహితీ జగత్తులో వీస్తున్న గాలి వచన కవితాశైలి. యతి, గణ, ప్రాసల ఛందస్సుతో పనిలేదు. నేటి సాంఘిక, రాజకీయాల పై రచయితలకు కల్గిన స్పందన, తమలోని భావుకతను ఉత్తేజ పరచగా, లోకాన్ని పలు భావాలతో, దర్శించి, దీర్ఘ కవితలతో ఆవిష్కరించి, కృతకృత్యులౌతున్నారు. భాష, భావం, సమ రీతిలో పరుగు పందెం వేయగా, ఎండ్లూరి సుధాకర్ ప్రకృతిని, సామాజిక పరిస్థితిని, తనలోని ఆవేదననూ, బాధనూ, యీ కవితల్లో వ్యక్తం చేశారు. తాను దర్శించిన గోదావరిని బహు భావాల్లో చిత్రించారు. పాఠకుణ్ణి ఆకట్టుకొనే రీతిగా యిందలి కవితలన్నీ సాగాయి. మనం నిత్యమూ చూచే గుర్ఖా, వీధులు చిమ్మే పని కత్తి, నగర సందర్శనం వంటి కవితల్లో కవి భావుకత బహు విధాలుగా గోచరిస్తుంది.ఇందులో ఆవేదన ఎంత వుందో ఆందోళన అంత వుంది. కరుణ వుంది, కన్నీరు వుంది. వ్యధ వుంది వేదన వుంది. అందుకే 'వర్తమానం' కవితలో "ఇప్పుడు నేను నా దేశం గురించి మాట్లాడలేను

ఎవరో కనిపడేసిన శకుంతల నా దేశం

నా దేశంలో నేను వలస పక్షిని

కత్తుల కొమ్మల మధ్య కన్నీటి గింజలు

నములుతున్న వాణ్ణి

నేను కొట్లకు పతగలిత్తిన వాణ్ణి కాను

కోటాను కోట్ల పతగల మీద

ఒక నీటి బుడగలా నిలుచున్న వాణ్ణి,

పగులగొడుతున్న అద్దంలోని ప్రతి

ముక్కను నేనే"

తన ఆవేదనను చెప్పారు.

వాస్తవికతను చిత్రించడం ఈనాటి కవుల కిష్టం. మనం నిత్యం చూచే 'గుర్ఖా'ను రచయిత యిలా వర్ణిస్తారు.

"అతడు రాత్రి సూర్యుడు

కల్లబొరియల్లో నిదురవాప మడత పెట్టి

దొంగ చీకటిని వెంటాడుతుంటాడు

అతడు ఆరు రుతువుల చెలికాడు

కాలం అతని చేతిలోని టార్చిలైటు

ఏ జ్వరమో తగిలి అతడు రోజు

ఆకాశంలో చుక్కలు, ఆవారా కుక్కలు

చీకట్లో కన్నీళ్లు రాలుస్తున్నట్లుంటాయి"

అని గుర్ఖా పైన సానుభూతినీ, అతని విద్యుక్త ధర్మాన్నీ కండ్లకు కట్టినట్లు చిత్రించారు.

'గోదావరి' నది అనేక కవితల్లో తల్లిగా, అనురాగ వల్లిగా, నదీమ తల్లిగా చిత్రించిన తీరు కవి భావుకతకు నిదర్శనం.

"గ్రీష్మ గోదావరి పాలి పోయిన దిగులు కళ్లతో నీటి మంచం మీద నిస్త్రాణంగా పడి వుంది" అనడం నవ్యభావన. "జీవితం రుతువులుగా మారిపోయిన వాళ్లకి కాలంతో కాపురం చెయ్యక తప్పదు. ఏ.సి గదులూ, ఏ సౌకర్యాలూ లేని వాళ్లకు గోదావరి పెంపుడు తల్లి. ప్రేమగా సేద దీరుస్తుంది" అని జీవిత సత్యాన్ని నదీమ తల్లి అనురాగాన్ని, చక్కగా చిత్రించాడీ కవితలో. అట్లే శ్వాసించే బాల్యం మధురానుభూతికి అక్షరాకృతి.

నా యాస మారినా, భాష మారినా

నా శ్వాసలోనే దాగుంది మన బాల్యం

అది మాత్రం ఇప్పటికీ ఎప్పటికీ అమూల్యం అనడం రచయిత భావుకతకు ఉదాహరణం

ఇందులో వీధులు చిమ్మే 'మైసమ్మ మరణం' కరుణ రసావిష్కరణకు నిదర్శనం.

సమస్త కల్మషాన్నీ కడిగేసే

గంగమ్మ తల్లిలా కనిపించేది,

మైసమ్మా! నాకూ, నీకు ఏ బంధం లేకున్నా

కొంత నా చెత్తను ఎత్తిపోసిన నీలో

అమ్మను చూస్తున్నా

నువ్వు బతికున్నప్పుడు

ఉతికి ఆరేసిన ధోవతిలా వుండే మన వీధి

ఇప్పుడు సమస్త కల్మష

కిరీటంలో విర్రవీగుతోంది

నిన్ను గుర్తు చేసుకొనే కాబోలు

చెత్తకుప్పలో పొర్లుతూ

మన నల్లకుక్క భోరున ఏడుస్తూ వుంటుంది. అని కరుణార్ద్ర చిత్రంతో కనులు చెమ్మగిల్లేలా కవిత వ్రాశాడు.

"ఇంకా ఎంత కాలం

మన నెత్తుల మీద ఈ మతం మోపులు

రండి మతాన్ని మట్టి చేద్దాం

మట్టిని మతం చేద్దాం" అని క్రొత్త దృశ్యం కోసం కవి ఆరాట పడుతున్నాడు.

సంసారం కత్తిమీద

సాముచెయ్యడమెలాగో ఎంతకీ అర్థం కాదు.

నేనిపుడు నడిచే ఖడ్గాన్ని

నన్నెవరు తాకలేరు

నేను నిద్రలేచినపులిని

నా కదలిక సింహ స్వప్నం

నా పాదముద్రలు చారిత్రక

రథ్యాలవుతాయి

అని తన ఆవేదనను ఉద్విగ్నంగా, నిర్భయంగా చెప్పుకొన్నాడు.

మొత్తం మీద కవితలన్నీ పాఠకుణ్ణి ఆలోచనా పరుణ్ణి చేస్తాయి. ఇందలి రూప కాలంకారాలు విచిత్రాలు. కొన్ని దుష్ట సమాసాలుండడం. విచారకరం. కవి వృత్తిరీత్యా అధ్యాపకుడు. భాషా దోషాలుండడం కావ్యానికి అపవాదమే! చక్కని, చిక్కని భావుకతకు ఈ గ్రంథం కాలానికి పట్టిన అద్దం లాంటిది. సామాజిక స్పృహ కలిగిన యీ కృతి కవి ప్రతిభకు అక్షరాకృతి. ప్రతి కవితలో నూత్న భావన, ఏదో ఆవేదన కనిపిస్తాయి. వర్తమాన సాహితీ జగత్తులో వెలసిన కృతులతో ఈ వర్తమానం కవితా సరస్వతికి నవాభరణం.

> **గ్రంథ సమీక్ష**
>
> **వర్తమానం**
>
> రచయిత
>
> **ఎండ్లూరి సుధాకర్**
>
> సమీక్ష కర్త
>
> **సురభి నరసింహం**
>
> ప్రతులకు
>
> తెలుగు లెక్చరర్
>
> తెలుగు యూనివర్సిటీ
>
> బొమ్మూరు
>
> రాజమండ్రి - 533 124
>
> మూల్యం
>
> **రూ. 15/-**

## పినాకినీ తీరం

(2 పేజీ తరువాత)

సహనం ప్రదర్శింప బడి వుంటే ఈ పరిస్థితిఏర్పడి వుండేది కాదు. గేటితో పోయేది గొర్దలి వరకు వచ్చి వుండేది కాదు.

ఈ చిన్న పొరపాటు మూల్యం ఎంతో ఈ క్షణంలో అంచనా వేయలేము; ఏదైనా అనూహిత పరిణామం సంభవించి అనుకూలత తోసుకొని వస్తే తప్ప. గజకర్ణ గోకర్ణ విద్యల వంటివి ఏవైనా ప్రదర్శితమైతే తప్ప. పాతాళ భైరవి వంటి వశీకరణ యంత్రం ఏదైనా చేతిలో వుంటే తప్ప. నిస్సహాయ స్థితిలో పడిపోవలసి వస్తుందా అనే సందేహం కలుగుతున్నది. ప్రయత్నంలో విఫలత ఎదురైతే నష్టపోయేది అభ్యర్థి కాదు; ప్రతిష్ట కోల్పోయేది నాయకుడు. పరిస్థితి అంత విషమ దశకు చేరుకోకుండా జాగ్రత్త పడడం విజ్ఞత కాదా?

### త్యాగస్థలి

రెండేళ్లుగా మనసులో కొట కలాడుతూ, తీరకుండా వుండిన ఒక కోర్కె మొన్న నెరవేరింది. దేశం కోసం తన ప్రాణాన్నే బలి చేసుకున్న మహనీయ నాయకుడు, ప్రజల హృదయాధినేత, యువభారతి ఆశాజ్యోతి రాజీవ్ గాంధీ రక్త మాంసాలతో తడిసిన త్యాగస్థలి అది - శ్రీ పెరంబదూరు. ఆ ప్రదేశంలో అడుగు పెట్టిన క్షణంలో జీవితం పునీతమైందనే అనుభూతి కలిగింది. ఎవరైనా దేశం కోసం, దేశ సమైక్యత కోసం, దేశ విచ్ఛిన్నానికి హింసా మార్గం చేపట్టిన రాక్షస మూకను తునుమాడడం, తన ప్రాణాలను అర్పించడం కంటే మహత్తర త్యాగం మరొకటి ముంటుంది!

ఆ ప్రదేశం ఆ అధ్యుని, అప్తుని కోల్పోయిన ఇంటి వలె శోక వాతావరణంతో, నిశ్చేష్ట నిర్భాంత వివర్ణ వదనంతో పట్ట పగలే, ఆకు కదలినా వినిపించేంతటి నిశాంత ప్రశాంతత నెలకొని వుందా అనిపించింది. బంగారు వంటి బిడ్డను కోల్పోయిన దేశ మాత రెండేళ్లు గడిచినా అక్కడ ఏకాకిగా కూర్చొని రోదిస్తున్నదా అనిపించింది. ఎవరు ఎంత తపించినా ఆ రాజీవుడు రాడు; ఆయన ఆత్మ మాత్రం ఆరని జ్యోతిలా ప్రకాశిస్తూ మనకు వెలుగు ప్రసాదిస్తూనే వుంటుంది.

రేపు 20 తేదికి, రాజీవ్ గాంధీ శ్రీ పెరంబుదూరు సభలో ఒక మానవ రాక్షసికి అహుతై రెండేళ్లు పూర్తి అవుతుంది. కాని ఆ త్యాగస్థలి ఇంకా ఆ శిథిల శకలాలతో దిక్కు మొక్కు లేని విధంగా అనాధ ప్రేతంగా పడి వున్నదెందు వల్ల? ఆ రోజు సభకు వచ్చే జనం కోసం చవక కొయ్యలతో నిర్మించిన క్యూ బ్యారికేడ్లు అట్లనే వున్నాయి తప్ప, వేదిక, వేదిక వద్ద వుండిన విలువైన, ప్రతి అంగుళం పరమ పవిత్రమైన ఆ స్థలంలో ఎక్కడ ఏమి జరిగింది చెప్పే మనిషి గాని, వివరించే బోర్డులు గాని ఏమీ లేవు. రాజీవ్ పటంతో, దీపపు సెమ్మె వగైరాలతో మూసి వుండిన ఒక కుటీరం, దానికి సమీపంలో దిమ్మె మీద పాగ చూరిన జ్యోతి వెలిగించే పాత్ర వుంది. ఇవి కాక ప్రక్కనే ఒక రేకుల గది; దాని ముందు గోడకు ఆనాటిదేనో ఏమో గుడ్డ మీద వ్రాసిన రాజీవ్ బొమ్మ వ్రేలాడుతున్నది. లోపల ఒక భాగంలో ఇద్దరు పోలీస్ కానిస్టేబిళ్లు గుర్రు పెట్టి నిద్రపోతున్నారు. 1991 అక్టోబరు లో ప్రధాని పి.వి. నరసింహారావు, తమిళనాడు ముఖ్యమంత్రి కుమారి జయలలిత రెండు మొక్కలు నాటారట. వాటి వద్ద మాత్రం పేర్ల వివరాలతో బోర్డులున్నాయి. ఇవి తప్ప మరే ఇతర బోర్డూ లేదు. దూరాభారం నుండి ఎంతో భక్తితో, విషణ్ణ హృదయంతో ఆపవిత్ర స్థలాన్ని చూడాలని పోతే, సందర్శకులు తెలుసుకోడానికి అక్కడ ఏమీ లేదు. సందర్శకులకు కావలసింది ఆనాటి సంఘటనలకు సంబంధించి వివరించే బోర్డులే గాని, మొక్కలు నాటిన వారి నామధేయాలతో వున్న బోర్డులు ముఖ్యం కాదు. దేశం కోసం ప్రాణార్పణ చేసిన నాయకుని కంటె అధికారంలో వుండే వీరే ఎక్కువైనారా?

రెండేళ్లు గడిచినా అక్కడ శాశ్వత స్మృతి చిహ్నాలు నెలకొల్పక పోవడం శోచనీయమే. ఎవరు చేయాలి ఆ పని? ఎవరు చేస్తారు? ఇంత ఆలస్యం జరగడం విచారకరం. జగడాలు పదవుల ప్రాకులాటలలో వుండే ఆసక్తి కాంగ్రెస్ వాదులకు ఇటువంటి సార్థకమైన కార్యాల పట్ల వుండక పోవడం బాధాకరం! ఎంత ఆశతో అక్కడకు పోయానో. అంత నిరాశతో తిరిగి రావలసి వచ్చింది. ఆనాటి సంఘటనలు తెలియక కాదు; పత్రికలు సచిత్రకంగా పూసగ్రుచ్చినట్లు వివరించాయి. కాని కంటితో చూచినప్పుడుండే తృప్తి చదివితే వుంటుందా?

శ్రీపెరంబుదూరులో రాజీవ్ నేల కూలిన ఆ ప్రదేశం దక్షిణ దేశంలో ఒక రాజఘాట్; ఒక శక్తి స్థలి. రాముడి లోటి రావణుడి పేరు ముడిపెట్టినట్లు, రాజీవ్ పేరొక్కటే ప్రజల హృదయాల్లో నిల్చి పోవాలి; ఆయన్ను పొట్టన పెట్టుకున్న ఆ కిరాతకపు ముండ పేరే మాసి పోవాలి!





## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. No. 91 of 1992

ఇండియన్ బ్యాంక్, నెల్లూరు

రెప్రజెంటడ్ బై ది మేనేజరు - వాది

Vs

1. M. సుబ్బారావు
2. Sk. మున్నీరు భాష - ప్రతివాదులు

2) To, Sk. మున్నీరు భాష

8/618, ముస్లిమ్ వీధి,

రంగనాయకుల పేట, నెల్లూరు

### నోటీసు

పై నెంబర్న వాది బాకీ రాబట్టు కొను నిమిత్తము మీ మీద దావా వేసి వున్నందున మీకు నోటీసు నిమిత్తం **17.6.1993** వాయిదా వేసి ఉంది. ఆ రోజు పగలు 10.30 గంటలకు మీరు పై కోర్టుకు హాజరై మీ ఆక్షేపణలు తెలుపుకోని యెడల మీ పరోక్షమున కేసు తీర్మానించబడును.

**కొండూరు శేషారెడ్డి**

వాది తరపు వకీలు

## గూడూరు డి.ము. కోర్టులో

E.P. No. 6/1987

G.O.S. No. 301/1983

జె. కోటేశ్వర రావు (లేట్)

- వాది (DHr)

Vs

పృథ్వి వెంకట రత్నం

-ప్రతివాది (JDr)

### వేలం ప్రకటన

డిక్రీ హోల్డర్కు డిక్రీ మొత్తం రాబట్టు కొను నిమిత్తం, జడ్జిమెంటు డెటరుకు చెంది అతని స్వాధీనాను భవంలో ఉన్న ఈ క్రింది కనపరిచిన షెడ్యూలు దాఖలా ఆస్తిని 3.5.93 తేదిన పై కోర్టులో ఉదయం 10.30 గంటలకు బహిరంగంగా వేలం వేయబడును. కొనదలచిన వారు కోర్టుకు హాజరై వేలంలో పాల్గొన వలసినదిగా ఇందు మూలముగా యావన్మందికి తెలుపడమైనది.

### షెడ్యూలు

నెల్లూరు రి.డి. గూడూరు సబ్ రి.డి. లో చేరిన చెన్నూరు గ్రామంలో ప్రతివాది (జె.డి.ఆర్) స్వాధీనంలో ఉండబడిన 11 వ వార్డు 129 నంబరు ఇంటికి హద్దులు. తూ: రాజవీధి; ద: పి. వెంకటేశ్వర్లుకు చెందిన కొట్టం నెం. 11/124; ప: పొరంబోకు; ఉ: చల్లా నవనీతమ్మ ఇల్లు ఈ హద్దులలోని 400 చ.మీ. ఇంటికి సంబంధించిన

సుమారు క్రయం రూ. 5000/-

అమినా క్రయం రూ. 10,000/-

వేలం తేది : 3.5.93

**యస్.యస్. నటరాజన్**

వాది న్యాయవాది, గూడూరు

ఫోన్ 363
వెంకటాచలం
ఎక్స్చేంజ్



# రావూస్

# రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

G.N.T. రోడ్డు, బుజబుజనెల్లూరు, చెముడుగుంట (బాలాజీ స్టీల్స్ సమీపంలో)
ఆఫీసు: రావూస్ కోచింగ్ సెంటర్, చాకలి వీధి, నెల్లూరు. ఫోన్స్: 26046, 23778

అత్యుత్తమ శిక్షణ | అపూర్వ ఫలితాలు | ఆధునిక వసతులు



1983 సం.లో స్థాపించబడి ఇంటర్మీడియట్, ఎంసెట్‌లకు ఉత్తమ విద్యాబోధన చేస్తూ, ఉత్తమ ర్యాంకులను సాధిస్తూ, అత్యుత్తమ విద్యా సంస్థగా 'రావూస్ కోచింగ్ సెంటర్' పేరొందింది. అదే ' రావూస్' ఆధ్వర్యంలో 'రావూస్ రెసిడెన్షియల్ కాలేజి' నెల్లూరుకు 7 కి.మీ దూరంలో రణగొణ ధ్వనులకు దూరంగా, ప్రశాంత వాతావరణంలో నెలకొల్పబడింది. అనుభవజ్ఞులైన ఉత్తమ అధ్యాపకులచే సుశిక్షణ, రెసిడెన్షియల్ వార్డన్‌లచే పర్యవేక్షణ, చక్కని లేబొరేటరీ సౌకర్యం, మంచి లైబ్రరీ మరియు అన్ని వసతులు కలవు.

జూనియర్ ఇంటర్ M.P. & Bi.P. (T.M. & E.M) లకు అడ్మిషన్లు ప్రారంభమైనవి. రూ. 30/- D.D.M.O. పంపి అప్లికేషను, ప్రాస్పెక్టస్ పొందవచ్చును. సీనియర్ ఇంటర్: క్లాసులు జూన్ 1 నుంచి ప్రారంభం. NOTE: ఇతర కాలేజీలలో జూనియర్ ఇంటర్ చదివి, సీనియర్ ఇంటర్ మా కాలేజీలో చేరుటకు ప్రవేశము కలదు. ఫీజు వివరాలు: ఇంటర్, ఎంసెట్–మెటీరియల్‌తో సహా శిక్షణ, వసతి భోజనము పర్యవేక్షణతో మొత్తం ఫీజు కేవలం రూ. 15,000/- మాత్రమే. ఫీజు 3 వాయిదాలలో చెల్లించవచ్చును.

మెరిట్ విద్యార్థులకు రాయితీలు: 10 వ తరగతి స్టేట్ ర్యాంకులో 10 లోపు ర్యాంకు పొందిన వారికి శిక్షణ, భోజనం, వసతి ఉచితం.
500 మార్కులు సాధించిన విద్యార్థులకు రూ. 2000/-, 450 మార్కులు సాధించిన వారికి రూ. 1,500/-
400 మార్కులు సాధించిన వారికి రూ. 1000/- ఫీజులలో మినహాయింపులు ఉంటాయి.

**NOTE:** ఇంటర్‌లో మెరిట్ స్కాలర్ షిప్ ఇవ్వబడును.



# రావూస్ కోచింగ్ సెంటర్

స్థాపితం : 1983

వి.ఆర్.సి. ఎదురుగా, చాకలి వీధి, నెల్లూరు - 1, ఫోన్స్: 26046, 23781

## గత 10 సంవత్సరాలుగా అత్యుత్తమ ఫలితాలందిస్తున్న విద్యా సంస్థ

సీనియర్ ఇంటర్ M.P.C. & Bi.P.C. (T.M. & E.M) అడ్మిషన్లు జరుగుచున్నవి. క్లాసులు మే 10 నుండి ప్రారంభం.
జూనియర్ ఇంటర్: EAMCET అడ్మిషన్లు ఏప్రెల్ 19 నుండి జరుగును. క్లాసులు మే 17 నుండి ప్రారంభం.
గత సంవత్సరాల వలెనే ప్రతి సబ్జెక్టులోనూ 25 యూనిట్ పరీక్షలు నిర్వహించబడును
సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబర్ ఆఖరుకు పూర్తి చేసి అక్టోబరు నుండి EAMCET కోచింగ్ యివ్వబడును.

**NOTE:** ముందుగానే అడ్మిషన్ తీసుకొని స్టడీ మెటీరియల్ పొందవచ్చును.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.